# జీవన్ ప[illegible]సుల నిరీక్షణ

## వలసపోయే పక్షులను చూచుటకు

ప్రతి శీతాకాలంలోను లక్షలాది పక్షులు చాల దూరం ఆహారం కొరకు, వేడి ప్రదేశం కొరకు ఎగిరి వెళ్లి అదే మార్గంలో వేసవిలో తిరిగి వస్తాయి. దీనినే వలసపోవడం




అంటారు.

ఆర్కిటిక్ టర్న్ ఉత్తర ధృవంలో వుంటాయి. శీతాకాలంలో పెద్ద పెద్ద గుంపులుగా 11000 మైళ్ల దూరంలో వున్న దక్షిణ ధృవానికి వలస వెళతాయి. మిగతా పక్షులకన్నా ఎంతో దూరంగా!

గోల్డెన్ ప్లోవర్ 2050 మైళ్ల దూరంతో వున్న హవాయికి అలిస్కా నుండి ఎగురుతుంది. దీనికి 35 గంటలు పడుతుంది.

2,50,000 సార్లు రెక్కలు ఆడిస్తుంది.




డెహ్రాడూన్ వద్ద 29,500 అడుగుల ఎత్తులో వలస వెళ్లిన బాతులు కనబడ్డాయి. అన్నింటికన్నా ఎక్కువ ఎత్తు.



పక్షులకు దారికనుగొనే, అద్భుతమైన సూక్ష్మబుద్ధి వుంది. యాంక్స్ షేర్ వాటర్ని అమెరికా తీసుకువెళ్లి వదిలిపెడితే,




అట్లాంటిక్ మహా సముద్రము దాటి 12 గంటలలో బ్రిటన్‌లో వున్న తన గూటికి తిరిగి వచ్చింది.

అప్పుడే పుట్టిన షేర్ వాటర్ మొదటి వలసలో అట్లాంటిక్ సముద్రం మీద నీరు కనిపించి నంత వర్కు 8000 మైళ్లు ఎగిరి సరిగ్గా ట్రిస్టా నదకున అనే దీవి మీద వాలింది.

రాత్రి సమయంలో ఆకాశాన్ని మ్యాప్‌లా ఉపయోగించి నక్షత్ర సమూహాన్ని, ఆకాశాన్ని గుర్తులుగా ఉపయోగించు కుంటాయి. చాలా పక్షులు, లోపల దిక్సూచి




అమర్చబడిందా అన్నట్లుగా భూమ్యాకర్షణ శక్తులకు లోనవుతాయి.

బాగా పరిచయమైన, భూప్రదేశములకొరకు, వడ్డును తాకే అలల శబ్దాల కొరకు, వెదుకుతూ వుంటాయి. అలల శబ్దాలు, మనకి వినపడనంత తక్కువగా ఉంటాయి.

ఈ శక్తులన్నీ పక్షులు దారి తప్పిపోకుండా వుండేలా కాపాడతాయి.






జీవిత భీమా అనేది మీ కుటుంబాన్ని సురక్షితంగా ఉంచుకోడానికి అతి భద్రమైన మార్గం. దాన్ని గురించి తెల్సుకోండి.



**లైఫ్ ఇన్స్యూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**

daCunha/LIC/129/82 TL

# ప్రతిక్షణం ఫ్లాష్ తాజాదనంతో పొంగిపోతోంది.

ఎందుకంటే కేవలం ఫ్లాష్‌లోనే
ఇప్పుడు నీలాకాశం రంగు
నోటిశుద్ధకారిణి ఉంది కనుక




**ఫ్లాష్ బ్లూ**
**టూత్ పేస్ట్**

**ఫ్లాష్ వాడండి,**
**చిరునవ్వులు చిందించండి.**

ఫ్లాష్‌లోని నీలి రంగు నోటి శుద్ధకారిణి, మీరు పళ్ళ బ్రష్ చేసుకోవడం ప్రారంభించిన తక్షణం మీ నోటి గాలిని తాజాగా మారుస్తుంది, మీ నోరంతటినీ శుభ్రంగా, తాజాగా మిలమిలలాడేలా చేస్తుంది. సంపూర్ణమైన నోటి సంరక్షణలో, దాని ఉత్తమ నాణ్యతకు గాను వియన్నాలో ప్రపంచ సెలక్షన్ బహుమతిని ఫ్లాష్ గెలుచుకుందంటే మరి ఆశ్చర్య మేముంది? ఫ్లాష్ ఇచ్చే సంరక్షణ మీ ఆరోగ్యమైన చిరునవ్వును రోజురోజుకీ మెరిపిస్తుంది.

everest/82/FL/81-tl

400 పైగా బహుమతులు!
ఒక చిత్రాన్ని వెయ్యండి!
మెరిసే ఒక సైకిల్‌ని గెలుచుకోండి!



క్యాడ్‌బరీస్

# 'జెమ్ చిత్రం'

పోటీ













# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళ కథ ["తనదికాని వైభవం"]కు ఆధారం "వసుంధర" రచన.

మనిషి కలిగినంతలో తృప్తిగా జీవిస్తూ, తన శక్తిసామర్థ్యాలకు అనుగుణంగా మరికొంత అభివృద్ధి కోసం ప్రయత్నించడం తెలివైన పద్ధతి. అలాకాక, దురాశకుపోయి, క్షణాల మీద సంపన్నుడు కావాలని చూడడం, మొదటికే ముప్పుతెస్తుంది. ఈ విషయం "ఆశలకొండ" అన్న కథలో వివరించబడింది.

## అమరవాణి

మాతాపితృభ్యాం జామాత్రా భ్రాత్రా పుత్రేణ భార్యయా,
దుహిత్రా దాసవర్గేణ వివాదం న సమాచరేత్.

[తల్లిదండ్రులతోను, అల్లునితోను, కొడుకుతోను, సోదరునితోను, కుమార్తెతోను, పనివాళ్ళతోను తగాదా పెట్టుకోరాదు.]


సంపుటి 71 అక్టోబర్ '82 సంచిక 4

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00



# ఆశలకొండ

నాగలాపురం గ్రామంలో గరటయ్య కిరాణా వ్యాపారం చేస్తూండేవాడు. అతడి దుకాణం జనం రద్దీగా వుండే నాలుగు వీధులు కలిసిన చోట వుండడంతో, వ్యాపారం బాగా సాగుతూ, మంచి లాభాలు వస్తూండేవి. అయినా, అతడు దానితో తృప్తిపడక, మరింతగా సంపాయించేందుకు మార్గాలేమిటా అని ఆలోచిస్తూండేవాడు.

ఒకనాడు గరటయ్య దుకాణంలో కూర్చుని వుండగా, వీధినే పోతూ ఒక కోయవాడు కనిపించాడు. గరటయ్య లోగడ చాలామంది కోయవాళ్ళను చూశాడు. కాని, వీడి వేషధారణా, ధాటీగా నడుస్తున్న తీరూ అతణ్ణి బాగా ఆకర్షించాయి. కొందరు కోయలు మంత్రతంత్రాలతో, చిట్కాలతో నిధులు దొరికేలా చెయ్యగలరని గరటయ్య వినివున్నాడు.

కోయవాణ్ణి, గరటయ్య కేకవేసి పిలిచి, అతడు దుకాణం దగ్గిరకు రాగానే, కూర్చోమని మర్యాద చేసి, "అరణ్యాల్లో, కొండల్లో బతికే మీ కోయదొరలకు డబ్బుతో అవసరం వుండదని విన్నాను, ఆ మాట నిజమేనా?" అని అడిగాడు.

కోయవాడు చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

గరటయ్య ఎంతో వినయంగా, "కోయదొరా, నేను చాలీచాలని సంపాదనతో నానా అవస్థలూ పడిపోతున్నాను. నా సంపాదన బాగా పెరిగే మార్గం ఏదైనా చెప్పగలవా?" అన్నాడు.

కోయవాడు దుకాణంలోని సరుకులకేసి చూస్తూ, "నీ దుకాణంలో అమ్మకాలు బాగానే వున్నట్టుంది. రోజుకు ఏమాత్రం లాభం సంపాయిస్తున్నావు?" అన్నాడు.

గుంటక సాంబిరెడ్డి

గరటయ్య ఎంతో నీరసంగా, "మామూలు రోజుల్లో అయితే యాభై, అదే పండగలూ, జాతర సమయాల్లో అయితే నూరు వరహాలు," అన్నాడు.

"అంటే, సంపాదన బాగా వున్నట్టే కదా! ఉన్నంతలో తృప్తిపడడం మంచిది," అన్నాడు కోయవాడు.

"ఏం తృప్తి! నా చిన్నప్పటి నుంచీ వ్యాపారం చేస్తున్నాను, ఎదుగూ, బొదుగూ అంటూలేదు. నా కంటె వెనగ్గా వ్యాపారం ప్రారంభించిన వాళ్ళు చాలామంది లక్షాధికారులూ, కోటీశ్వరులూ అయ్యారు. మీరు నివసించే కొండప్రాంతాల ఎక్కడైనా, నాకు యింత నిధి దొరికే ఉపాయం చెప్పకూడదా, కోయదొరా!" అన్నాడు గరటయ్య దీనంగా.

కోయవాడు ఒకక్షణం ఆలోచించి, సంచిలోంచి ఒక తాటాకుతీసి, దానిమీద గంటంతో ఏదో రాసి, గరటయ్యకిస్తూ, "దీన్ని తీసుకుపోయి అడవిలోని గూడెంలో వున్న మా కోయదొరకిస్తే, నీకు నిధి చూపిస్తాడు," అన్నాడు.

గరటయ్య మహదానందంతో తాటాకు తీసుకుని, మరసటి రోజు ఉదయానే బయలుదేరి, సాయంకాలానికి కోయ గూడెం చేరాడు. అతడిచ్చిన తాటాకు చూసుకుని కోయపెద్ద గరటయ్యను ఆద



రించి, ఆ రాత్రి విశ్రాంతి తీసుకుని, చీకటితోనే లేచి నిధి దగ్గిరకు వెళ్ళవచ్చన్నాడు.

ఆ రాత్రి నిధిని గురించిన ఆలోచనలతో గరటయ్యకు కంటిమీద కునుకు లేదు.

ఇంకా కొంచెం చీకటిగా వుండగానే కోయపెద్ద, గరటయ్యను పిలిచి, అతణ్ణి అడవి దాటించి, ఒక మైదాన ప్రదేశానికి తీసుకుపోయి, రెండు తోలు సంచులు యిచ్చాడు. అందులో ఒక దానినిండుగా మంచినీళ్ళున్నవి; రెండోది ఖాళీ సంచి.

"గరటయ్యా, యిక్కడి నుంచి అంతా ఎడారి. నువ్వాకనబడుతున్న కాలిబాటను పట్టిపోతే, మధ్యాహ్నానికల్లా ఎడారి మధ్య



వున్న ఒక కొండను చేరుకుంటావు. అదే ఆశలకొండ! ఆ కొండ గుహలో బంగారు నాణాలు కుప్పలుగా వుంటాయి. వాటిని ఖాళీ తోలు సంచిలో నింపుకో. రెండో సంచిలోవున్న నీళ్ళు, నువ్విక్కడికి తిరిగొచ్చేవరకూ సరిపోతాయి. తిరిగొచ్చాక, అరసంచీ బంగారం నేను తీసుకుంటాను, మిగిలింది నీకు!'' అన్నాడు కోయపెద్ద.

గరటయ్య సంతోషంగా తలవూపి, ఎండలో ఎడారినపడి, మధ్యాహ్నానికి ఆశలకొండను చేరాడు. అప్పటికి సంచిలో వున్న నీళ్లలో సగం అయిపోయాయి.

కొండ గుహలోవున్న బంగారం చూసి, గరటయ్యకు కళ్ళు చెదిరాయి. సంచి నిండా బంగారం నింపుకున్న తర్వాత అతడికి ఒక ఆలోచన వచ్చింది. నీళ్ళు పారబోసి, ఆ రెండవ సంచీలో కూడా బంగారం నింపుకుపోవడం బావుంటుంది. కోయగూడెం చేరేవరకూ, దాహాన్ని కాస్త అదుపులో పెట్టుకోవచ్చు!

గరటయ్య నీళ్ళు పారబోసి, ఆ సంచిని కూడా బంగారంతో నింపి, రెండు సంచులనూ భుజానికి తగిలించుకుని, తిరుగు ప్రయాణం అయ్యాడు. అతడు కింద కాళ్ళూ, పైన తలా కాలుతూండగా ఎండలో కొంతదూరం నడిచేసరికి దాహం వేసింది. రెండు సంచుల బరువుతో భుజాలు పీకుతున్నాయి. ఎక్కడైనా మంచినీళ్ళు దొరికితే బావుండునని గరటయ్య దిక్కులు చూడసాగాడు.

హఠాత్తుగా అతడికి ఆ దారినే వస్తూ ఒక మనిషి కనిపించాడు. అతడి భుజాన్నుంచి ఒక చిన్న నీళ్ళకుండ వేళ్ళాడుతున్నది.

గరటయ్య ఆశగా అతడి కేసి చూసి, ''అయ్యా, నాలుక ఎండిపోతున్నది, కాసిని మంచినీళ్ళిస్తారా?'' అని అడిగాడు.

''అందుకే వచ్చాను! దోసెడు మంచి నీళ్ళు, రెండు దోసెళ్ళ బంగారం ఖరీదు. సరేనంటే యిస్తాను,'' అన్నాడా మనిషి.

గరటయ్య కొంచెం తటపటాయించి, దాహం భరించలేక అతడికి రెండుదోసెళ్ళ బంగారం యిచ్చి, ఒక దోసెడు మంచి నీళ్ళు తాగాడు.

మరొక గంట గడిచేసరికి, మళ్ళీ దాహం భరించలేని స్థితికి వచ్చాడు, గరటయ్య. అంతలో మరొక మనిషి అతడి ముందు ప్రత్యక్షమయ్యాడు. మొదటివాణ్ణి అడిగినట్టే, గరటయ్య అతణ్ణి మంచినీళ్ళిమ్మని అడిగాడు.

"దోసెడు మంచినీళ్ళ ఖరీదు నాలుగు దోసెళ్ళ బంగారం. ఇష్టమేనా?" అన్నాడా మనిషి.

గరటయ్య కొంచెం సేపు మథనపడి, దాహానికి ఓర్చలేక, ఆ మనిషికి నాలుగు దోసెళ్ళ బంగారం యిచ్చి, ఒక దోసెడు మంచినీళ్ళు తాగాడు.

మరి కొంత దూరం నడిచేసరికి, తిరిగీ దాహం బాధ మొదలైంది, గరటయ్యకు. లోగడలాగానే, మరెవరైనా మంచినీళ్ళతో అటు వస్తే, బాగుండునే అనుకున్నాడతను. అంతలో మరొక మనిషి కనిపించి, "దాహం వేస్తున్నదా? ఎనిమిది దోసెళ్ళ బంగారం యిస్తే, ఒక దోసెడు మంచి నీళ్ళిస్తాను," అన్నాడు.

"అంత ఖరీదా!" అని గరటయ్య ఆ మనిషిని కసిరి, ప్రాణాలుగ్గబట్టుకుని నడవసాగాడు.

ఆ మనిషి, గరటయ్యను అనుసరించి రాసాగాడు. గరటయ్య కొంచెం భయంగా,



అతణ్ణి, "నువ్వు, నా వెనకే వస్తున్నా వెందుకు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు నవ్వి, "భయపడకు! నువ్వు బతికున్నంతవరకూ, నీ బంగారాన్ని అంటను," అన్నాడు.

అతను మాట పూర్తి చేసేలోపలే గరటయ్య మంచినీళ్ళివ్వమన్నట్టుగా సైగ చేసి, స్పృహతప్పి కిందపడిపోయాడు. ఆ మనిషి గరటయ్య ముఖం మీద నీళ్ళు చల్లి, అతడికి స్పృహరాగానే తాగేందుకు నీళ్ళిచ్చాడు.

అప్పటికి గరటయ్యకు తిరిగి ప్రాణం వచ్చినట్టయింది. ఆ మనిషి గరటయ్యతో మూడు దోసెళ్ళ నీళ్ళు ఖర్చయాయని చెప్పి, ఇరవైనాలుగు దోసెళ్ళ బంగారం తీసుకుని వెళ్ళిపోయాడు. దానితో గరటయ్య దగ్గిర అరసంచీ బంగారం మాత్రం మిగిలింది.

తిరిగి గూడేనికి వచ్చిన గరటయ్య వద్ద అరసంచీ బంగారం మాత్రమే వుండడం చూసి, కోయపెద్ద, "ఓహెూఁ, నే చెప్పినట్టు చెయ్యకుండా అత్యాశకు పోయావన్నమాట! ఒట్టి ఆశపోతువు; నీకు ప్రాప్తం లేదు," అని, ముందే చెప్పినవిధంగా అరసంచీ బంగారం తీసుకున్నాడు.

గరటయ్య దుఃఖంతో నిలువునా కుప్పకూలిపోతూ, "కోయదొరా! ఆ ఆశల కొండ దగ్గిరకు పోయేందుకు, మరొక్క అవకాశం యివ్వండి," అని వేడుకున్నాడు.

"జీవితంలో ఎవరికైనా, ఒక్కసారి మాత్రమే ఆ కొండ దగ్గిరకు వెళ్ళే అవకాశం కలుగుతుంది. మరొకసారి నువ్వు వెళ్ళినా, ఆ కొండగుహ మూసుకుపోయి వుంటుంది," అన్నాడు కోయపెద్ద.

గరటయ్య కాళ్ళీడ్చుకుంటూ రెండు రోజుల ప్రయాణంతరవాత ఇల్లు చేరాడు. దొరికిన నిధి పోగా, జాతర రోజుల్లో దుకాణం మూయడం వల్ల, అతడికి రావలసిన అయిదువందల వరహాల లాభం కూడా పోయింది.






## 12

[కోయకుల పెద్దలు పంపిన దూతను నరవాహనుడు అవమానించి పంపగానే, వాళ్ళు యుద్ధసన్నాహాలు ప్రారంభించారు. కొండమీద వున్న శిథిలదుర్గం ఆక్రమించుకుని, ఆ ప్రదేశాన్నుంచి యుద్ధం నడపాలని వాళ్ళ ప్రయత్నం. నరవాహనుడు కాల్బల, గజ సైనికులను దుర్గం ముట్టడించేందుకు పంపాడు. యుద్ధం ప్రారంభమైంది. తరవాత—]

కొండ దిగువ ప్రారంభమైన సైనికుల కోలాహలం, ఏనుగుల ఘీంకారాలూ విన్న ఇద్దరు కోయ యువకులు శిథిల దుర్గ ప్రాకారాల మీద నిలబడి దిగువకు చూస్తూ, "శత్రువులు తోడేలుగూడెం ప్రాంతాల వరకూ వచ్చారు. వాళ్ళు ఎక్కి వున్న ఏనుగుల మీదకు మనవాళ్ళు, సింహాలను వదిలారు," అంటూ అమితోత్సాహంతో చప్పట్లు చరిచారు. నేను పరుగు పరుగున ఆ కోయ యువకులు వున్నచోటు చేరాను— అంటూ చెప్పుకుపోతున్నాడు శివదత్తుడు.

విజయగర్వంతో కన్నుమిన్ను కానకుండా ముందుకు వస్తున్న నరవాహనుడి గజ సైనికులూ, వారి వెనుకనే నడుస్తున్న పదాతి సైనికులూ మాకు కనిపించారు. దాదాపు తోడేలుగూడెం ప్రాంతంలో వారి మీదకు కోయ

యువకుల చేత చెట్ల చాటునుంచి హఠాత్తుగా సింహాలు వదలబడినై. భీకరంగా గర్జిస్తూ ముందుకు వురికే సింహాలను చూసి ఏనుగులు వెనుదిరిగి చెల్లాచెదరు కాసాగినై. ఇక, వాటి కాళ్ళ కింద పడకుండా, మీది మీదికి వస్తున్న సింహాల నోళ్ళ పడకుండా, నరవాహనుడి సైనికులు అన్ని వైపులకూ పారి పోతున్నారు.

''చాలా మంచి పని చేశారు!'' అన్నాను నా పక్కన వున్న కోయ యువకులతో. ''అయితే, ఆ సింహాలను తిరిగీ మీ వాళ్ళు పట్టుకుని, మరోమారు శత్రువుల మీదికి వదలగలరా?'' అని అడిగాను.

''అన్ని సింహాలనూ తిరిగి పట్టుకోవటం సాధ్యమయే పని కాదు. కొన్ని అడవిలోకి పారిపోవచ్చు.'' అన్నారు వాళ్ళు.

ఆ సరికి నాకు యీ రకమైన పోరాటంలో వున్న నమ్మకం కాస్తా పోయింది. ఆయుధాలతో సర్వసన్నద్ధులై వున్న సైనికుల పైకి యీ రకంగా సింహాలనూ, పులులనూ వదిలితే, ఒకసారికి వాళ్ళు భయపడి పారిపోవచ్చు. కాని, రెండవ సారి తగు జాగ్రత్తలో వచ్చి వాటిని హతమార్చగలరు!

ఆ రోజు ప్రొద్దుగూకే వరకూ ఆ అడవి ప్రాంతాల యిలాంటివే మరికొన్ని విచిత్ర దృశ్యాలు చూశాను. ఒక చోట నరవాహన



సైనికులు గుంపుగా కూర్చుని భోజనాలు ప్రారంభించబోతున్నారు. హఠాత్తుగా వారి మధ్యకు చెట్ల మీదినించి ఒక పెద్ద గంప విసరబడింది. మరుక్షణం అందులోనుంచి వేలాది విషసర్పాలు బుసలు కొడుతూ బయటికి దూకినై. నరవాహనుడి సైనికులు ఎక్కడివారక్కడే తమ ఆయుధాలను వదిలి పారిపోయారు. సర్పాలు తమ దారిన పుట్టల్లోకీ, చెట్ల మీదికీ వెళ్ళిపోయినై.

ఈ రకమైన యుద్ధతంత్రంతో నరవాహనుణ్ణి జయించటం సాధ్యమయేది కాదని, ఆ రాత్రి కోయ వృద్ధుడితో చెప్పాను. ఒకసారికన్న ఎక్కువసార్లు వుపయోగించేందుకు వీలు లేని ఆయుధాలవల్ల కలిగే ఫలితం ఏమీ వుండదన్న నా అభిప్రాయంతో అతడూ ఏకీభవించాడు.

ఆ రాత్రి చాలాసేపు యోచించిన మీదట నేనొక నిర్ణయానికి వచ్చాను. కోయ వృద్ధుడికి సాధ్యమైనంత వివరంగా సంగతి సందర్భాలన్నీ చెప్పాను. శత్రు సైన్యంలో ఎక్కువ భాగాన్ని, ఈ దుర్గ ప్రాంతానికి ఆకర్షించి, నాశనం చేయాలి. శిథిలమైవున్నా, యీ దుర్గం ఎవరి చేతుల్లో వుంటే వారు, నాలుగైదింతలున్న శత్రువునైనా ఎదుర్కొని నాశనం చెయ్యవొచ్చు.

ఇక, శత్రువును నాశనం చేసే బాధ్యత నా మీద పడింది. నేను అక్కడ చేరిన ఏడెనిమిదిమంది కోయకుల పెద్దలకు






పరిస్థితి వివరించి చెప్పాను. శత్రువు బలవంతుడు, అతడికి సుశిక్షితమైన సైన్యం వుంది! కొండమీద వున్న శిథిల దుర్గాన్ని ముట్టడించేందుకు అతడికి అశ్వికబలం, గజారూఢులై యుద్ధం చేసే సైనికులూ నిరుపయోగం. కనక, శత్రువు ముఖ్యంగా పదాతి దళాన్నే వుపయోగించాలి. అలాంటప్పుడు శిథిల దుర్గానికున్న మార్గాల నన్నిటినీ బిగించి, పైకి వచ్చే శత్రువుల మీదికి రాళ్ళను దొర్లించవచ్చు. అక్కడ వున్న చెట్లపై నుంచి బాణాలను ప్రయోగించవచ్చు. ఇంత చేసినా శత్రువు శిథిల దుర్గాన్ని చేరగలిగితే ఆపైన చేయగలిగిందేమీలేదు.

ఇప్పుడు నేను చేయవలసిన పనిని దుర్గ రక్షణ అనేకంటే, దుర్గ ప్రాంతాల రక్షణ అంటేనే బావుంటుంది. ఈ శిథిలమైన దుర్గంలో రక్షించేందుకు ఏమీలేదు. కాని దుర్గాన్ని రక్షణగా వుపయోగించుకుంటున్నామని శత్రువును మోసగించి, అతణ్ణి కొండదారులు పట్టించి సర్వనాశనం చేయాలి.

బాణాలు వదలటంలో మంచి గురీ, నేర్పూ వున్న యువకుల్ని ఏరి దుర్గం చుట్టూ వున్న చెట్ల మీద కాపు పెట్టాను. మంచి దేహబలం వున్న కోయలను పెద్ద పెద్ద బండరాళ్ళ వెనక నిలిపి, అవసరం అయినప్పుడు శత్రువుల మీద వాటిని తోయవలసిందిగా ఆజ్ఞాపించాను.

సరిగా సూర్యుడు పడమటి దిక్కుకు ఒరిగే సమయానికి నా రక్షణ కార్యక్రమమంతా పూర్తి అయింది. ఆ సరికి దేహబలం వున్న కోయలంతా తమ తమ ఆయుధాలతో శిథిల దుర్గ ప్రాంతాన్ని చేరటం, వాళ్ళను తరుముకుంటూ నరవాహనుడి సైనికులు కూడా దిగువకు చేరటం జరిగింది.

శత్రువులు క్రమశిక్షణతో ఒక నాయకత్వం కింద ఒకచోట గుమిగూడక ముందే, నేను రహస్యంగా చెట్లపై వుంచిన కోయభటులు వాళ్ళ మీదకు

బాణాలు కురిపించసాగారు. మనుషులు కనపడకుండా, హఠాత్తుగా బాణం వచ్చి తాకటంతో ప్రాణాలు కోల్పోతూ నరవాహనుడి సైనికులు కంగారుపడసాగారు. కొందరు ఆ కంగారులో గురి చూడకుండానే తమ బాణాలను, ఆ చుట్టు పక్కల వున్న చెట్ల మీదకు వదిలారు.

అదే సమయంలో మరికొందరు నరవాహనుడి సైనికులు కత్తులు చేతబట్టి కొండ ఎక్కడం ప్రారంభించారు. అలాంటి శత్రుసైనికుల మీదికి, నేను నియమించిన కోయ భటులు పెద్ద పెద్ద బండరాళ్ళను దొర్లించసాగారు. ఇరుకు దారులలో పక్కలకు పారిపోయేందుకు అవకాశం లేక అనేకమంది శత్రు సైనికులు యీ బండరాళ్ళ కింద పడి అరుస్తూ ప్రాణాలు వదిలారు.

ఈ విధంగా పోరాటం మహా భయంకరంగా నాలుగైదు గంటల కాలం సాగింది. ఈ లోపల నరవాహనుడి సైనికులలో అధిక సంఖ్యాకులు కొండను ఎగబాకి శిథిల దుర్గ ప్రాంతాలను చేరుకున్నారు. కొండ దిగువ చెట్ల మీద వున్న కోయ భటులను రక్షించి పైకి తీసుకు వచ్చే అవకాశం లేదని నేను గ్రహించాను. చెట్ల కొమ్మలలో వుండి విషపూరితమైన అంబులను వదిలేవారిని తుదముట్టించేందుకు నరవాహన సైనిక నాయకులు ఒక కొత్త పద్ధతిని అవలంబించారు.




గజారూఢులై వున్న సైనికులు ఆ చెట్ల కిందకు రావించబడ్డారు. మావటీవాడి సంజ్ఞ కాగానే ఏనుగులు తమ తొండాలతో చెట్లకొమ్మలను పట్టి విరవసాగినై. ఫెళ ఫెళారావాలతో విరిగి పడుతున్న కొమ్మలతో పాటు అందులో దాగివున్న కోయ భటులు కూడా కింద పడసాగారు. అలా కింద పడుతున్నవారిని శత్రు సైనికులు తమ కత్తులతో, యీటెలతో పొడిచి హతమారుస్తున్నారు.

ఇలా కొంతసేపు జరిగేసరికి కోయభటులందరూ, నరవాహన సైనికుల చేతుల్లో

చంపబడటమో, గాయపడటమో జరిగి పోయింది. ఎవరూ లేరన్న ధైర్యం చిక్కగానే, నరవాహన సైనికులు పెద్దగా కేకలు పెడుతూ, గుంపులు గుంపులుగా చేరి తమ తమ వాహనాలతో కూడా మిట్టపల్లాలుగా వున్న కొండను ఎక్కేందుకు ప్రయత్నించారు.

గుర్రాల్పనూ, ఏనుగులనూ కొండ ఎక్కించేందుకు ప్రయత్నించే ఆ శత్రు నాయకుల బుద్ధిహీనత నన్ను చాలా ఆశ్చర్యపరిచింది. మావటివాని శూలం పోటు కుంభస్థలం మీద తగిలేసరికి చేసేది లేక కొన్ని ఏనుగులు కొండ రాళ్ళను ఎక్కేందుకు ప్రయత్నించినై. పట్టుబలవంతాన ఆ విధంగా కొంత దూరం కొండ ఎక్కి, అక్కడ కాలికింద వున్న ఏ పెద్ద బండరాయో జారటంతో అక్కడి నుంచి ఘీంకరిస్తూ అవి కొండ కిందకు దొర్లసాగినై. ఇక గుర్రాల అవస్థ కూడా అంతే!

నేను నా అనుచరులతో, చావగా మిగిలిన కోయ భటులతో శిథిల దుర్గం కేసి తిరోగమించాను. దుర్గ ద్వారం దగ్గిర కోయ వృద్ధుడు నన్ను కలుసుకున్నాడు.

"శివదత్తా, మేము జయించే అవకాశం లేదనుకుంటాను," అన్నాడు వృద్ధుడు. అతడి కంఠస్వరంలో విచారంగాని, భయ చిహ్నాలుగాని నాకు పొడగట్టలేదు. "ఒక వేళ అదే జరిగితే, ప్రతిఘటించకుండా



కేవలం పశువుల్లా మేము ఆ నరవాహను డికి లొంగిపోలేదన్న తృప్తి నాకు మిగులుతుంది! అదే చాలు. ఈ శిథిల దుర్గంలో మా అంతిమ పోరాటం జరుగుతుంది. మీరు మీ అనుచరులతో ఏదైనా సురక్షిత ప్రదేశానికి వెళ్ళవలసిందని కోరుతున్నాను.''

కోయ వృద్ధుడు యిలా చెప్పేంతలో ఆ దుర్గ ప్రాంతమంతా నరవాహన సైనికుల కేకలతో మార్మోగిపోయింది. అన్నిటికీ తెగించిన కోయ భటులు, శిథిలమైన దుర్గప్రాకారాల నుంచి నరవాహన సైనికులను ఎదుర్కొన్నారు. కోయ వృద్ధుడు కూడా అంతవరకూ అధికార చిహ్నంగా తన వద్ద వున్న దండాన్ని అవతల పారవేసి, కత్తి చేబట్టి శత్రువుల మీదికి వురికాడు.

ఇక అప్పుడు జరిగిన బాహాబాహి యుద్ధం వర్ణనాతీతం. ప్రాణాలపై ఆశలు వదలుకొన్న కోయ భటులు, సుశిక్షితులైన నరవాహన సైనికులను రెల్లు దుబ్బులను నరికినట్టు నరకసాగారు. కాని, సంఖ్యలో పదింతలున్న శత్రుసైనికులు క్రమక్రమంగా కోయ భటులను వెనుకకు నెట్టుతూ శిథిల దుర్గం ప్రవేశించారు.

నేను నా అనుచరులతో, వెనుకకు తగ్గుతూ దుర్గ ప్రాకారాలు దాటి బయట పడ్డాను. కోయ వృద్ధుడు తుదిసారిగా అన్న మాటలు నా చెవుల్లో మార్మోగుతూనే వున్నవి. బహుశా యీసరికి అతడు



పోరాటంలో మరణించే వుంటాడు! నేను వెనుదిరిగి దుర్గం కేసి చూశాను. ఒక విరిగిపోయిన గోడ మీద బక్కచిక్కిన అతడి రూపం నా కంటబడింది. కత్తి ఝుళిపిస్తూ, అతడు తన అనుచరులను ప్రోత్సహించి, గోడ పక్కనే వున్న పాతికమంది నరవాహన సైనికుల మధ్యకు అరుస్తూ దూకేశాడు. ఆ కోయ వృద్ధుడి పట్టుదలా, ధైర్యసాహసాలూ నా నేత్రాలను చెమ్మగిల చేసినై.

నేను నా అనుచరులతో కొండ దిగి వేవేగంగా సముద్రం కేసి బయలు దేరాను. ఇక ఆ ద్వీపంలో వుండటం ఏ మాత్రం క్షేమకరం కాదని నిర్ణయించుకున్నాను. అదృష్టదేవత నన్ను పూర్తిగా మరవలేదన్న సూచనగా, సముద్ర తీరాన రెండు పడవలు కనిపించినై. నా అనుచరులతో ఆ పడవ లెక్కతెడ్ల సహాయంతో మహాసముద్రం మధ్యకు బయలుదేరాను. ఎటు పోవాలి? ఎక్కడికి పోవాలి? అన్న ఆలోచన నాకు కలగలేదు. దారిలో మీరు తటస్థపడ్డారు! మందరదేవా యిదీ, నా కథ!'' అన్నాడు శివదత్తుడు.

''సమరసేనుడి చరిత్రా, మీ చరిత్రా రెండూ రెండు అద్భుతాలు!'' అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు మారుమాటాడకుండా చిరునవ్వు నవ్వాడు. అంతలో పడవలలో వున్న ఒక సైనికుడు లేచి నిలబడి, ''చూడండి, అక్కడ ఏదో వెలుగు కనబడుతున్నది!'' అంటూ అరిచాడు.

మందరదేవుడు అటు కేసి చూసి, ''శివదత్తా, అదేదో ద్వీపంలాగా వున్నది. మనం ఈ మహాసముద్రంలో దారీ తెన్నూ లేకుండా పోయేకన్న, ఏదో ఒక ద్వీపం చేరటం మంచిదిగదా?'' అన్నాడు.

''అవును, పడవలను ఆ ద్వీపాని కేసి పోనిద్దాం. అది మానవ వాస యోగ్యమైనదే అయితే ఫరవాలేదు; లేక ఏ భయంకర ద్వీపమో అయితే....'' శివదత్తుడు మాట ముగించకుండా నవ్వి వూరుకున్నాడు. —(ఇంకా వుంది)





# తనది కాని వైభవం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎవరి మేలు కోసం నువ్వింతగా శ్రమలపాలవుతున్నావో, నాకు తెలియదు. కాని, చేబట్టిన కార్యం సాధించిన తర్వాత, అది నీకు మేలు చేస్తుందో, కీడే చేస్తుందో ముందుగా ఊహించడం చాలా కష్టం. ఏది ఏమైనా, నీకు మార్గదర్శకంగా వుండేందుకు, ఒక తండ్రీ కొడుకుల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

నారాయణవరం అనే గ్రామంలో, గోవిందుడు అనే రైతు వుండేవాడు. అతడికి సారవంతమైన పదెకరాల మాగాణిభూమి వుండేది. రమానందుడు

## బేతాళ కథలు



అతడి ఒక్కగానొక్క కొడుకు. గ్రామంలో మరే కుర్రవాడికీ లేనంతగా రమానందుడికి చదువుపట్ల ఆసక్తి వుండేది. ఆ కారణం వల్ల అతడు యుక్తవయస్కుడయేసరికి, గ్రామంలో విద్యాధికుడన్న పేరు తెచ్చుకున్నాడు.

రమానందుడికి వ్యవసాయంలో శ్రద్ధ లేదు. అతడు తండ్రి వద్దన్నా లక్ష్య పెట్టక, పట్నం వెళ్ళి, రాజుగారి ఆస్థానంలో ఉద్యోగం సంపాయించుకుని, వివాహం కూడా చేసుకున్నాడు.

సంవత్సరాలు గడుస్తున్నా, రమానందుడు తండ్రిని చూసేందుకు ఒక్కసారి అయినా గ్రామానికి తిరిగి రాలేదు.

గోవిందుడు మాత్రం, తనకు తెలిసిన వాళ్ళెవరైనా పట్నం వెళ్ళుతున్నప్పుడు, కొడుకును ఒకసారి రమ్మని కబురు పంపుతూండేవాడు.

రమానందుడు తండ్రి కోర్కె విన్నప్పుడల్లా, "ఆ పల్లెటూళ్ళో ఏముంది? నాన్నే, యిక్కడికి వచ్చివుండవచ్చు గదా," అనేవాడు.

ఆఖరుకు కొడుకు మీది మమకారంతో, గోవిందుడు తనే పట్నం బయలుదేరుతూ, ఆ సంగతి షావుకారు బంగారయ్యకు చెప్పాడు.

గోవిందుడు తన డబ్బు బంగారయ్య వద్ద దాచుకునేవాడు.

గోవిందుడి ప్రయాణం గురించి విని, బంగారయ్య, "పట్నానికి అడవిదారి మినహా, మరొక మార్గం లేదు. ఆ దారిలో ఒక దొంగల ముఠా వున్నది. నీ డబ్బంతా వాళ్ళు దోచేస్తారు. నా వద్ద ఒక డబ్బా వున్నది. దాని మూత తెరిచావంటే, ఒక విధమైన వాయువు బయిటికివచ్చి, చుట్టు పక్కల వున్న వాళ్ళందరూ మూర్ఛ పోతారు. నోట్లో కరక్కాయ వున్న వాడి మీద మాత్రం, ఆ వాయువు ప్రభావం చూపించదు," అన్నాడు.

ఆ డబ్బా ఖరీదు ఒక బంగారు కాసు. గోవిందుడు ఆ డబ్బాతోపాటు, కొన్ని

కరక్కాయలు కూడా దుస్తుల్లో దాచుకున్నాడు.

అడవి దారిలో అతడికి ఒక మనిషి తారసపడ్డాడు. ఆయన విలువైన దుస్తులు ధరించి వున్నాడు. భుజాన్నుంచి ఒక పెద్ద మూట వేళ్ళాడుతున్నది. మాటి మాటికీ దగ్గుతూ, చెట్ల కింద విశ్రాంతి కోసం ఆగుతూండడం వల్లనే, ఆయన గోవిందుడి కంటబడ్డాడు.

గోవిందుడు ఆయనకు దగ్గు తగ్గేందుకు ఒక కరక్కాయ యిచ్చాడు. కొద్ది క్షణా ల్లోనే ఆయన దగ్గు మంత్రించినట్టు మాయ మయింది.



ఆ తర్వాత అడవి మార్గాన కొంచెం వేగంగా యిద్దరూ నడవసాగారు. కరక్కాయను మాత్రం ఆయన నోట్లోనే వుంచుకున్నాడు.

మాటల సందర్భంలో ఆయన తన పేరు రత్నసేనుడని గోవిందుడికి చెప్పాడు. ఆయన పట్నంలో గొప్ప ధనికుడు. అడవి దారిలో ప్రయాణించడం యిదే మొదటి సారి. ఆయన గుర్రం ఎక్కి వస్తూండగా, పెద్ద దగ్గు తెర వచ్చింది. గుర్రం దిగి, ఆయాసపడుతూ, ఒక చెట్టు నీడన కూర్చున్నాడు. ఆ సమయంలో, దూరంగా ఏదో అడవి జంతువు అరవడం విని, గుర్రం బెదిరి పారిపోయింది.

ఇలాంటి కష్టసమయంలో గోవిందుడి తోడు దొరికినందుకు రత్నసేనుడు చాలా సంతోషించాడు.

మార్గంలో ఒకచోట వాళ్ళిద్దర్నీ నలుగురు దొంగలు అటకాయించారు. ముందు రత్నసేనుడు తన మూట విప్పాడు. దాని నిండా విలువైన వజ్రాలున్నవి. దొంగలు గోవిందుణ్ణి తన దగ్గిర వున్న డబ్బు బయిటికి తీయమన్నారు.

గోవిందుడు ఎంతో నిబ్బరంగా తనకు బంగారయ్య యిచ్చిన డబ్బా వాళ్ళకు చూపుతూ, "నా దగ్గిర కూడా కొద్దిగా వజ్రాలున్నవి!" అంటూ మూత తెరిచాడు.



ఆ మరుక్షణం నలుగురు దొంగలూ స్పృహతప్పి పడిపోయారు. ఈ విధంగా ప్రమాదం నుంచి బయటపడి ఇద్దరూ త్వరలోనే పట్నం చేరారు.

రత్నసేనుడు, గోవిందుడికి తన కృతజ్ఞత చెప్పుకుని, "మీరు కొద్దిరోజులైనా మా ఇంట వుండి వెళ్ళాలి," అని బలవంత పెట్టాడు.

గోవిందుడికి త్వరగా వెళ్ళి కొడుకును చూడాలని వున్నది. అయినా, అతడు రత్నసేనుడి కోర్కెను కాదనలేకపోయాడు.

రత్నసేనుడి ఇంట గోవిందుడికి రాజ మర్యాదలు జరిగినై. ఇద్దరు సేవకులు రోజంతా అతడి దగ్గిరే వుండి, అన్ని అవసరాలూ చూసేవారు. పంచభక్ష్యపరమాన్నాలతో భోజనం, మెత్తటి పరుపులపై నిద్ర మాత్రమే కాక, గోవిందుడి వినోదం కోసం చక్కటి నృత్యప్రదర్శనలు కూడా ఏర్పాటు చేయబడినై.

ఆలా మూడు రోజులు గడిచాక గోవిందుడు, రత్నసేనుడితో తాను కొడుకు దగ్గిరకు వెళతానన్నాడు.

అందుకు రత్నసేనుడు నొచ్చుకుని, "మీకిక్కడ ఏమి లోటు జరుగుతున్నది? మీ అబ్బాయికి కబురు పంపి, యిక్కడికే రప్పిస్తాను. మీరున్నంతకాలం, అతడూ యిక్కడే వుంటాడు," అన్నాడు.

గోవిందుడు అందుకు అంగీకరించలేదు. చివరకు రత్నసేనుడు, "పోనీ, ఒక పని చెయ్యండి. ఒక రోజు మీ కొడుకు ఇంట్లో గడిపి, నచ్చితే అక్కడే వుండిపొండి, నచ్చని పక్షంలో మా ఇంటికి వచ్చెయ్యండి. మిమ్మల్ని మొహమాటపెట్టడం నా కిష్టం లేదు. అందువల్ల పిలవడానికి, మీ ఇంటికి రాను. మీరు, నాకు చిన్న కబురు పంపితే చాలు, మీ కోసం రత్నాలపల్లకీ పంపుతాను," అన్నాడు.

గోవిందుడు సరేనని కొడుకు ఇంటికి వైభవంగా వెళ్ళాడు. రత్నాలపల్లకిలో

ఇంటి ముందు దిగిన తండ్రిని చూసి, రమానందుడు ఆశ్చర్యపడ్డాడు. గోవిందుడు కొడుక్కు జరిగినదంతా చెప్పాడు.

ఆయన కొడుకు ఇంటి పరిస్థితి చూశాడు. ఇంట్లో చిన్నా, పెద్ద పనులు చేసేందుకు నౌకర్లున్నారు. రాజాస్థానంలో పనివుండి వచ్చిన కొందరు ఎంతో వినయంగా, చేతులు కట్టుకుని అతడితో మాట్లాడుతున్నారు. ఒక రకంగా తన కొడుకూ వైభవంగానే జీవిస్తున్నాడు.

ఆయన ఆ ఇంట్లో స్వేచ్ఛగా తిరిగాడు. మనసు విప్పి కొడుకుతోటీ, కోడలితోటీ మాట్లాడాడు. వెంట తెచ్చిన డబ్బు వాళ్ళకు యిచ్చేశాడు.

మర్నాడు రమానందుడు, తండ్రితో, ''నాన్నా, మా ఇంట్లో ఒక రోజున్నావు. ఇప్పుడు నీ మిత్రుడు రత్నసేనుడికి కబురు చేసి, రత్నాలపల్లకీ తెప్పించుకుంటావా ?" అన్నాడు.

అందుకు గోవిందుడు, ''వెర్రివాడా! ఎవరికైనా పుట్టి పెరిగిన ఊళ్ళో, సొంత ఇంట్లో వున్న ఆనందం మరెక్కడా లభించదు. నా వల్ల రత్నసేనుడికి లక్షలు లక్షలు లాభించాయి; ఆ కారణంగానే ఆయన నన్ను ఆదరించాడు. తనదికాని వైభవం ఎవరికీ శాశ్వత సంతోషాన్నివ్వదు!'' అన్నాడు.

ఆ తర్వాత వారం తిరక్కుండానే, ఒకనాటి ఉదయం రమానందుడు,



తండ్రితో, "నాన్నా, నేను ఆస్థాన ఉద్యోగానికి రాజీనామా యిచ్చేశాను. మన ఊరు వెళ్ళిపోదాం," అన్నాడు.

కొడుకు నిర్ణయానికి గోవిందుడు పరమానందం చెందాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, "రాజా, రమానందుడు చేసినపని అనాలోచితంగా కనిపించడంలేదా? అతడు ఎంతో కష్టసాధ్యమైన రాజాస్థాన ఉద్యోగం సంపాయించగలిగాడు. ఆ కారణంగా అతడు ధనమేకాక, ప్రజల నుంచి గౌరవాభిమానాలు కూడా పొందుతున్నాడు. అలాంటి పరిస్థితుల్లో ఉద్యోగం మాని, సొంత ఊరు వెళ్ళిపోవాలనుకోవడం వెర్రితనమనిపించుకోదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రమానందుడి నిర్ణయం అనాలోచితంకాదు; వెర్రితనం అంతకన్నాకాదు. తనవల్ల ఎంతగానో లాభపడిన రత్నసేనుడు యివ్వజూపిన వైభవాలను తండ్రి తిరస్కరించాడు. కారణం, అది తనదికాని వైభవం! ఆ సంగతే గోవిందుడు కొడుక్కు సూచన ప్రాయంగా చెప్పాడు. అందులో వున్న సత్యాన్ని గ్రహించిన రమానందుడు రాజోద్యోగిగా తనూ తనది కాని వైభవం అనుభవిస్తున్నానని తెలుసుకున్నాడు. రాజుకు ఏ నిమిషాన అతడి పట్ల అయిష్టం కలిగినా, రమానందుడు ఉద్యోగం పోగొట్టుకోవడంతోపాటు, అప్పటివరకూ ప్రజలు చూపించే గౌరవాభిమానాలకూ్కడా దూరమవుతాడు. ఇదంతా ఆలోచించే అతడు స్వగ్రామంలో వున్న పొలం సేద్యం చేసుకుంటూ, ఏ ఒడిదుడుకులు లేకుండా సుఖంగా బతకవచ్చునన్న నిర్ణయానికి వచ్చాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -- (కల్పితం)





# విమలాదేవి వడ్డాణం

అమరేంద్రపురం రాజు జయకాంతుడి భార్య విమలాదేవికి, రత్నాలు తాపడం చేసిన విలువైన వడ్డాణం ఉండేది. అది ఎన్నో ఏళ్ళ క్రితం తయారుచేసినది కావడంతో, ఒకనాడు రాణి దాన్ని ధరిస్తూండగా, మధ్యకు విరిగిపోయింది.

విమలాదేవికి ఆ వడ్డాణమంటే చాలా యిష్టం. జరిగినదానికి ఆమె చాలా బాధ పడింది. ఆమె భర్తకు సంగతి చెప్పి, నిపుణుడైన స్వర్ణకారుడి చేత దాన్ని బాగు చేయించమని కోరింది.

రాజు, మంత్రికి ఆ పని అప్పగించాడు. ఈ సంగతి తెలిసిన స్వర్ణకారులు కొందరు మంత్రి దగ్గిరకు వచ్చి, వడ్డాణాన్ని బాగు చేసే పని తమకు యివ్వవలసిందిగా కోరారు. మంత్రి విచారించగా, ఫణిభూషణాచారి అనే స్వర్ణకారుడు గొప్ప నిపుణుడని తెలిసింది. ఆయన వడ్డాణాన్ని అతడికిచ్చి, వారం రోజుల్లో పని ముగిసేలా చూడమన్నాడు.

ఫణిభూషణుడికి యిలాంటి గౌరవం లభించడం, అప్పుడప్పుడూ రాణీగారికి నగలు తయారుచేసి యిచ్చే సాంబశివాచారి అనే స్వర్ణకారుడికి అసూయ పుట్టించింది. అతడు చేస్తున్న నగలలో అంతగా నాణ్యత వుండడం లేదని రాణీగారు లోగడ చెప్పివుండడంతో, మంత్రి యీసారి వడ్డాణం విషయమై అతణ్ణి సంప్రతించను కూడా లేదు.

ఫణిభూషణాచారి వడ్డాణాన్ని బాగు చేసి, రెండు వారాల తరవాత మంత్రికి యిచ్చాడు.

వారం రోజుల పాటు తనకు అనారోగ్యంగా వుండడంతో, పని పూర్తి కావడానికి మరొక వారం పట్టిందని అతడు మంత్రికి విన్నవించుకున్నాడు.

రాంబాబు

రాణి విమలాదేవి ఫణిభూషణుడి పనితనం చూసి చాలా ఆశ్చర్యపోయింది. అతడు అంత పాత వడ్డాణాన్ని, కొత్త వడ్డాణంలా తయారుచేశాడు. రాజు, ఫణిభూషణుడికి వెయ్యి వరహాలు బహూకరించి, అతడి నైపుణ్యాన్ని మెచ్చుకున్నాడు.

దీనితో సాంబశివాచారిలో అసూయ మరింతగా రగులుకున్నది. అతడు ఒకనాడు రాజును దర్శించి, ''మహారాజా, ఫణిభూషణుడు వారం రోజుల్లో యివ్వవలసిన వడ్డాణాన్ని, మరొక వారం రోజులు ఆలస్యంగా యివ్వడానికి కారణం యిప్పుడే తెలుసుకున్నాను. ఒక వారం రోజుల పాటు అతడి భార్య ఆ వడ్డాణాన్ని పెట్టుకుని తిరిగింది. మహారాణిగారి ఆభరణాలను ఒక సాధారణ స్త్రీ ధరించడం, క్షమించరాని నేరం,'' అన్నాడు.

ఈ మాటలు విని రాజు మండిపడ్డాడు. అయినా, ఆయన తొందరపడక, సాంబశివుడు చెప్పినదాంట్లో వున్న నిజానిజాలు తెలుసుకోమని మంత్రిని ఆదేశించాడు.

మంత్రి మర్నాడు రాజును కలుసుకుని, ''మహారాజా, ఫణిభూషణుడూ, అతడి భార్యా నిర్దోషులని నిస్సందేహంగా చెప్పవచ్చు. అసూయకొద్దీ నిందారోపణ చేసిన సాంబశివాచారికి నూరు కొరడా దెబ్బల శిక్ష విధించండి,'' అన్నాడు.

''ఫణిభూషణుడు నిర్దోషి అని ఏ రుజువులవల్ల తెలుసుకోవడం జరిగింది?'' అని రాజు అడిగాడు.

మంత్రి ఒక భటుణ్ణి పిలిచి, ఫణిభూషణుడినీ, అతని భార్యనూ అంతఃపురానికి తీసుకురమ్మన్నాడు. ఒక పావు గంట తరవాత వచ్చిన ఫణిభూషణుడి భార్యను చూసి, రాణి విమలాదేవితో బాటు, దాసీలు కూడా నవ్వుకున్నారు.

ఫణిభూషణుడి భార్య చాలా స్థూలకాయురాలు. అసత్యారోపణ చేసినందుకు రాజు, అప్పటికప్పుడే సాంబశివాచారికి నూరు కొరడా దెబ్బల శిక్ష విధించాడు.



# ధర్మగంట

చంపక దేశాన్నేలే శూరసింహుడు గొప్ప న్యాయపాలకుడన్న పేరు పొందాడు. ఆయన రాజభవనం ముందు ఒక ధర్మగంట వేళ్ళాడగట్టించాడు. పౌరులెవరైనాసరే తమకు జరిగిన అన్యాయం గురించి రాజుకు చెప్పదలిస్తే, ఆ ధర్మగంట మోగించవచ్చు.

ఇరవై ఏళ్ళ క్రితం తపస్సు చేసుకునేందుకు హిమాలయాలకు పోయిన శూరసింహుడి గురువు తిరిగి వచ్చాడు. రాజు ఆయన్ని తన భవనానికి ఆహ్వానించి, తన పరిపాలన ఎలా సాగుతున్నదీ వివరంగా చెపుతున్నాడు. ఆ సమయంలో రాజభవన పర్యవేక్షకుడు అక్కడికి వచ్చి, "ప్రభూ, ధర్మగంట బాగా అరిగిపోయిన కారణంగా, ధ్వని సరిగా రావడంలేదు. కొత్త గంట చేయించడం అవసరం," అన్నాడు.

రాజు ఆశ్చర్యపోతూ, "కొద్దికాలం కిందటేగదా, కొత్త ధర్మగంట చేయించాం! అప్పుడే అది అరిగిపోవడం జరిగిందా?" అన్నాడు.

"అవును, ప్రభూ! దేశంలో ధర్మగంటతో పనిలేని పౌరుడున్నట్టు కనబడడంలేదు. అందువల్లనే అది త్వరగా అరిగిపోయింది," అన్నాడు భవన పర్యవేక్షకుడు.

"అయితే, ఈసారి మరింత మంచి లోహంతో, కాస్త పెద్దదిగా వుండే ధర్మగంట తయారుచేయించు," అన్నాడు రాజు.

ఆ మాటలకు రాజగురువు నవ్వి, "రాజా, యిప్పుడు కావలసింది మరొక ధర్మగంట కాదు, ధర్మం! దేశంలో ఎన్ని చెరసాలలూ, వైద్యశాలలూ వున్నవన్నది లెక్కకాదు, ప్రజలు వాటికి దూరంగా వుంటూ, ఎంత సుఖంగా బతుకుతున్నారన్నది ముఖ్యం!" అన్నాడు.

గురువు మాటలతో శూరసింహుడికి తన పరిపాలనలో వున్న లోపం తెలియవచ్చింది.

—సరిపల్లి వెంకటరవికిరణ్






ఒక నవాబుగారి వద్ద ఒక వజీరుండేవాడు. ఆయన ఒకనాడు ఎంతో అందగత్తె అయిన ఒక అడ బానిసను కొన్నాడు. ఈ సంగతి నవాబుకు తెలిసింది. ఆ బానిసను స్వయంగా చూద్దామనే ఉద్దేశంతో నవాబు, "ఈ రాత్రికి నేను మీ ఇంటికి భోజనానికి వస్తున్నాను," అని నౌకరు ద్వారా తన వజీరుకు కబురు చేశాడు.

వజీరు నవాబుగారి కోసం పెద్ద ఎత్తున వంటకాలూ, పానీయాలూ సిద్ధం చేయించాడు. పానీయాలు అందించడానికి తన కొత్త బానిసను నియోగించాడు. ఇద్దరూ భోజనం ముగించుకుని, పానీయాలు తాగుతూ కబుర్లు చెప్పుకోసాగారు.

అకస్మాత్తుగా నవాబు, "వజీర్, ఈ బానిస పిల్లను నాకు అమ్మెయ్యి. నువు ఎంత ధనం యిచ్చి కొన్నావో, అంతకు రెట్టింపు ధనం నీకు ఇస్తాను," అన్నాడు.

"ఏలినవారు మన్నించాలి. ఈ బానిసను అమ్మే ఉద్దేశం నాకు ఎంత మాత్రమూ లేదు," అన్నాడు వజీరు ఎంతో వినయంగా.

"అమ్మే ఉద్దేశం లేకపోతే, ఈమెను నాకు బహుమానంగా ఇచ్చెయ్యి," అన్నాడు నవాబు.

"అలాంటి ఉద్దేశం కూడా నాకు ఏ మాత్రమూ లేదు," అన్నాడు వజీరు నిర్మొహమాటంగా.

వజీరు ధోరణి చూసి నవాబుగారికి పట్టరాని కోపం వచ్చింది. "నువు ఈ బానిసను నాకు అమ్మటమో, బహుమానం చెయ్యటమో, చెయ్యకపోయావంటే, అల్లా సాక్షిగా నేను నా పట్టపు

రాణీకి విడాకులిచ్చేస్తాను!'' అని శపథం చేశాడు.

''నేను నా భార్యనూ, పిల్లలనూ వదిలేస్తానుగాని ఈ బానిసను తమకు అమ్మనూ, ఇవ్వనూ! లేకపోతే నేను అల్లాకు ద్రోహం చేసినవాణ్ణే!'' అన్నాడు వజీరు పట్టుదలగా.

తీరా నోరు జారి ఘోర ప్రమాణాలు చేసేశాక, ఇద్దరికీ ఎక్కడలేని పశ్చాత్తాపం కలిగింది.

''ఇప్పుడేం చేసేటట్టు? మన ఇద్దరి ప్రమాణాలకూ భంగం కలగకుండా మర్యాదగా బయటపడే ఉపాయం ఏమిటి?'' అన్నాడు నవాబు.

''ఈ ఉపాయం చెప్పగలవాడు కాజీ ఒక్కడే! ఏలినవారి సెలవైతే ఆయనకు భటుడి ద్వారా రమ్మని కబురు చేస్తాను,'' అన్నాడు వజీరు.

నవాబు సరేనన్నాడు. వజీరు కాజీని పిలిపించాడు. కాజీ వచ్చి సంగతంతా తెలుసుకుని, ''ఇదేమంత గొప్ప సమస్య కాదు. వజీరుగారు నవాబుగారికి సగం బానిస పిల్లను అమ్మి, మిగిలిన సగమూ బహుమానంగా ఇస్తే చిక్కు విడిపోతుంది,'' అని సలహా ఇచ్చాడు.

నవాబు ఈ యుక్తికి చాలా సంతోషించి, ''భేష్, బాగుంది. ఇంకొక



సలహా కూడా చెప్పు; ఈ పిల్లకు బానిస స్థితి పోతేనేగాని నా జనానాలో చేర్చటానికి వీలులేదు. చట్టరీత్యా ఈమె బానిసత్వం పోగొట్టటానికి చాలా తతంగం వుంటుంది. దానికి కూడా ఏదైనా సులువు మార్గం త్వరగా ఆలోచించు,'' అని కాజీని అడిగాడు.

''అందుకు ఒకటే సులువు మార్గం! ఈమెను ఎవరికైనా ఇచ్చి ఇప్పుడే పెళ్ళి చేస్తే సరి! ఈమె బానిసత్వం ఈ క్షణమే పోతుంది. వెంటనే ఆ మనిషి చేత ఈమెకు విడాకులిప్పించి, ఏలినవారు ఈమెను తమ జనానాలో చేర్చుకోవచ్చు,'' అన్నాడు కాజీ.

"చాలా బాగుంది. ఒక భటుణ్ణి పిలిపించు," అన్నాడు నవాబు వజీరుతో.

వజీరు తన దగ్గిర వున్న భటుణ్ణి ఒకణ్ణి పిలిపించాడు. అతనికి బానిస పిల్లనిచ్చి అప్పుడే పెళ్ళి చేసి కాజీ, "ఇక ఈ పిల్ల బానిసకాదు. స్వతంత్రురాలు! ఇప్పుడీమెకు ఈ భటుడి చేత విడాకులిప్పిస్తాము!" అన్నాడు.

కాని భటుడు ఇందుకు ఒప్పుకోలేదు. "నా భార్య చాలా అందగత్తె. ఆమెకు విడాకులిద్దామనే ఉద్దేశం నా కెంత మాత్రమూ లేదు," అన్నాడు వాడు. నవాబూ, వజీరూ ఎంత బెదిరించినా వాడు లొంగలేదు.

నవాబుకు మండిపోయింది. ఆయన కాజీతో, "దౌర్భాగ్యుడా! ఇదా నువు చెప్పే యుక్తి? ఈ చిక్కు విడదీయకపోయావంటే నీ తల కొట్టి కోట ద్వారానికి వేళ్ళాడగడతాను!" అన్నాడు.

"ఏలినవారు తొందరపడుతున్నారు. ఈ చిక్కు ఒక లెక్కలోది కాదు. వజీరు గారు ఈ భటుణ్ణి నాకు బానిసగా ఇచ్చేస్తే అన్ని చిక్కులూ క్షణంలో తీరిపోతాయి!" అన్నాడు కాజీ.

"ఇచ్చేశాను. తీసుకో!" అన్నాడు వజీరు.

కాజీ బానిసపిల్ల కేసి తిరిగి, "ఈ భటుడు నా బానిస. వీణ్ణి నీకు బానిసగా ఇచ్చేస్తాను, పుచ్చుకుంటావా?" అని అడిగాడు.

"మహదానందంగా పుచ్చుకుంటాను," అన్నదామె.

"ఇంకేముందీ? చట్టప్రకారం నీ బానిస నీ భర్త కావటానికి వీలులేదు. మీ పెళ్ళి రద్దయిపోయింది! నేను వచ్చిన పని కూడా అయిపోయింది," అంటూ కాజీ లేచాడు.

నవాబు కాజీని ఆపి, "మాకు న్యాయం చెప్పి సలహా ఇచ్చినందుకు ఇదిగో బహుమానం!" అంటూ ఒక సంచీ నిండా బంగారు నాణాలు పోయించి, స్వయంగా కాజీకి యిచ్చాడు.






బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో ఒకప్పుడు, బోధిసత్వుడు ఉత్తమజాతి అశ్వంగా జన్మించాడు. అది రాజుగారి గుర్రాలలోకెల్లా ప్రధానమైన పంచకల్యాణిగా ఎంచబడుతూ వుండేది. అందుచేత దాని పోషణ, అలంకరణ, ప్రత్యేకించి రాజలీవి ఉట్టిపడేటట్టు జరుపుతూ వచ్చారు.

రాజుగారి గుర్రాలలో ముఖ్యమైన ఆ పంచకల్యాణికి మూడేళ్ళనాటి ప్రశస్తమైన పాత ధాన్యాలతో ఆహారం తయారుచేసి పెట్టేవారు. దాని ఆహారం మామూలు అన్ని గుర్రాలకు మోస్తరుగా కాక, వేయి మొహిరీలు ఖరీదు చేసే ఒక బంగారు పళ్ళెంలో పెట్టేవారు. అది మసిలే శాల గుమగుమలాడుతూ పరిమళించేది. ఆ శాల చుట్టూతా ఆకర్షణీయమైన తెరలు వేలాడుతూ వుండేవి. పైన బంగారు పువ్వులు చమికీ వేసిన అందాల చాందినీ కట్టబడి వుండేది. నాలుగు గోడలకూ సువాసనలు విరజిమ్మే రకరకాల పుష్పజాతులు అమర్చబడి వుండేవి. రాత్రింబగళ్ళు ఆ శాల అగరువత్తుల ధూపంతో, సుగంధ ద్రవ్యాల పరిమళాలతో వెలిగిపోతూ వుండేది.

ఇటువంటి ఉత్తమమైన అశ్వంగల కాశీ రాజును చూస్తే ఇరుగు పొరుగు సామంతరాజు లెవళ్ళకూ అంతగా ఇష్టం వుండేది కాదు. ఒకప్పుడు ఏడుగురు సామంత రాజులు ఒకటిగా చేరి, కాశీ రాజుకు ఇలా రాయబారం పంపించారు: "మీ రాజ్యం మాకు వప్పగించినాసరే, లేకుంటే యుద్ధానికి తయారై వచ్చినా సరే," అని.

వెంటనే కాశీరాజు తన మంత్రులను సమావేశపరచి, సంగతి సందర్భాలు



విప్పి చెప్పాడు. అందుకు మంత్రులు, ''మహారాజా! మీరు యుద్ధరంగానికి స్వయంగా వెళ్ళ పనిలేదు. మన సేనాని వీరవర్మను పంపిస్తే సరి. అతడే జయించుకు వస్తాడు. అటువంటి వాడే జయించలేకపోయినట్టయితే, తరవాత సంగతి అటుపైన ఆలోచిద్దాం,'' అని సలహా యిచ్చారు.

అప్పుడు కాశీరాజు సేనానిని పిలిపించి, ''ఓయీ, వీరవర్మా! మన మీదికి ఇప్పుడు ఏడుగురు సామంతులు ఎదురు తిరిగి రాబోతున్నారు. ఆ ఏడుగురినీ జయించటం నీవల్ల నవుతుందా?'' అని అడిగాడు. ''మహాప్రభూ! ఏలికకు ఎంతో ప్రియమైనటువంటి పంచకల్యాణిని దయ చేయిస్తిరంటే ఈ ఏడుగురు రాజులనే కాదు, దేశమంతటినీ ఒక్క దెబ్బతో జయించుకు రాగలను,'' అని ధీమాగా పలికాడు వీరవర్మ. అందుకు రాజు సంతోషంతో, పంచకల్యాణిని తీసుకు వెళ్ళి యుద్ధం జయించుకు రమ్మని సేనానిని పంపాడు.

రాజు వద్ద సెలవు తీసుకున్న సేనాని, వెంటనే పంచకల్యాణిని తీసుకొని, యుద్ధానికి బయలుదేరాడు.

వీరవర్మ మెరుపులాగా కోట నుండి ఇవతల పడ్డాడు. ధైర్య సాహసాలతో పోరాడి, మొదటి సామంతుణ్ణి పట్టి, బందీగా తీసుకున్నాడు. మళ్ళీ యుద్ధరంగానికి వచ్చి, రెండవ సామంతునీ, అలాగే వరసగా ఐదుగురు రాజులనూ బందీలుగా చేసుకొన్నాడు.

ఇంతవరకు జయించుకు వచ్చిన వీరవర్మ ఆరవ మకాముకు చేరుకుని, ఆ రాజుతో తలపడి జయించేటంతలో అతని గుర్రానికి దెబ్బ తగిలి, గాయం నుంచి నెత్తురు ప్రవహింపసాగింది.

వీరవర్మ పంచకల్యాణిని ఒక ద్వారం వద్ద కట్టివేసి, మరొక గుర్రాన్ని తీసుకొని యుద్ధానికి వెళదామని ఆలోచించాడు. ఈ ఆలోచనతో, పంచకల్యాణికి వున్న

జీనూ, కళ్ళెమూ తక్కిన సామగ్రి విప్పి వేయబోయాడు.

అప్పుడు పంచకల్యాణి రూపంలో వున్న బోధిసత్వుడు సేనాని చేస్తున్న పనిని కళ్ళు విప్పి చూశాడు. "అయ్యో, వీరుడా! ఎంత అమాయకుడవు! నాకు దెబ్బ తగిలిందనగానే మరి వొక గుర్రాన్ని తయారు చేసుకుందా మనుకుంటున్నావు. ఏడవ మకాము భేదించి, ఏడవ సామంత రాజును పట్టి ఇవ్వడం ఆ గుర్రానికేమి చేతనవుతుంది? అలా నమ్మి, కొత్త గుర్రాన్ని తీసుకోవటంతో ఇంతవరకు నేను చేసిన పని అంతా వ్యర్థం అయిపోతుందే. పైగా, నువ్వు నిష్కారణంగా శత్రువు చేతులలో పడి చచ్చిపోతావే! మన యజమాని అయిన కాశీరాజు అతి సులువుగా సామంతుల చేతులలో చిక్కుకొనిపోతాడే! ఏడవ సామంతరాజును జయించటం ఒక్క నావల్లనే అవుతుందిగాని మరొక గుర్రానికి అలవికాదని నీకు తెలియకపోయె కదా!" అని అనుకుని విచారించింది.

అంతటితో ఊరుకోలేదు. దెబ్బ తగిలి అలా పడిపోయి వున్న ఆ పంచకల్యాణి వీరవర్మను దగ్గరకు పిలిచి, ఇలా చెప్పింది:

"ఓయీ, శూరుడా! వీరవర్మా! ఏడవ మకాము బేదించి ఏడవ శత్రురాజును పట్టగల గుర్రము నేను తప్ప మరొకటి లేదని తెలుసుకో. ఇంతవరకూ నేను చేసిన పని వ్యర్థం కానీయకు. ఎటువంటి



పరిస్థితులలోనైనా ధైర్యం, సాహసం ఉండాలి. ఇందుకుతోడు ఆత్మవిశ్వాసం, గుండెనిబ్బరమూ అవసరమై వుంది. కనుక, నా మీద పూర్తి నమ్మకం కలిగి వుండు. దెబ్బ తగిలినంత మాత్రాన నన్ను విడిచి పుచ్చకు. గాయం తగిలిన నా కాలుకి వెంటనే కట్టుకట్టి బాగు చెయ్యి. మళ్ళీ నన్ను పూన్చి, త్వరగా యుద్ధ రంగానికి బయలుదేరు,'' అని అనేక విధాల బోధ చేసింది.

తక్షణమే వీరవర్మ తన పంచకల్యాణికి కట్టుకట్టి మళ్ళీ తయారు చేశాడు. దాని పైన ఎక్కి బయల్దేరేసరికి, అది మెరుపు లాగా మెరిసి, చూస్తూ వుండగా ఏడవ మకాం భేదించింది. వీరవర్మ ఏడవ సామంతుని కూడా బందీగా పట్టి వేశాడు. వీరవర్మకే యుద్ధంలో విజయం కలిగింది.

బందీలుగా పట్టుబడిన ఏడుగురు సామంతులనూ, సైనికులు కాశీరాజు ఎదుట పెట్టారు. పంచకల్యాణి రూపంలో వున్న బోధిసత్వుడూ అక్కడికి వచ్చాడు. వచ్చి, రాజుతో ''ప్రభూ! ఈ ఏడుగురూ నీకు సాటి రాజులు. వారిని హింసించటం తగదు. వారిని కించపరచటం కూడా న్యాయం కాదు. నీకు తోచిన ఒక షరతు పెట్టి, వారిని ఆ షరతుకు లోబరచి వది లేయటమే సమంజసం, రాజా! ఉదారత కలిగి వుండు. ధర్మబుద్ధితో న్యాయంగా రాజ్యం యేలుకో,'' అని బోధించగా, భటులు వచ్చి గుర్రం వంటిపైన వుండే అలంకారాలన్నీ తీసివేశారు. తీస్తూ వుండ గానే పంచకల్యాణి రూపంలో వున్న బోధి సత్వుడు పంచత్వం పొందాడు!

తరువాత కాశీరాజు ఆజ్ఞప్రకారం సమస్తమైన మర్యాదలతోనూ గుర్రానికి ఉత్తర క్రియలు జరిగినై. వీరవర్మకు గొప్ప గౌరవం జరిగింది. ఏడుగురు సామంతులనూ వారి వారి రాజ్యాలకు పంపివేశారు. నాటినుండీ కాశీరాజ్యంలో బోధిసత్వుని ఇష్టప్రకారం న్యాయసమ్మతంగా, ధర్మయుతంగా పరిపాలన సాగుతూ వచ్చింది.





# చిత్తూరు రాణి పద్మిని–2

అలా ఉద్దీన్ చేసిన ద్రోహానికి, ప్రతి ఒక్క రాజపుత్రుడూ క్రోధావేశం చెందాడు. కాని, పద్మిని మాత్రం ఆవేశానికి లోనుగాక, దళనాయకుల్నీ, పినతండ్రి గోరానూ, సాహసానికి పేరు బడ్డ బాదల్ అనే యువకుణ్ణీ సమావేశ పరిచి, వాళ్ళకు ఒక పథకం వివరించింది. అందరూ అందుకు ఒప్పుకున్నారు.

ఒక రాజపుత్ర నాయకుడు అలా ఉద్దీన్ దగ్గిరకు రాయబారిగా వెళ్ళాడు. ఆయన సుల్తానుతో, పద్మిని అతడి గుడారానికి రావడానికి యిష్టపడుతున్నదని చెప్పాడు. అయితే, సుల్తాను ఆమెను రాచమర్యాదలతో వచ్చేందుకు అనుమతించాలి. పద్మిని మేనాలలో తన చెలికత్తెలను వెంటబెట్టుకుని వస్తుంది.





ఇందుకు అలా ఉద్దీన్ సంతోషంగా ఒప్పుకున్నాడు. సాయంసమయంలో చిత్తూరుదుర్గం నుంచి, ఏడు వందల మేనాలు సుల్తాను గుడారాల కేసి బయలుదేరినై. సుల్తానూ, అతడి పరివారమూ వాటికేసి తన్మయులై పోతూ చూడసాగారు.



అన్నిటికన్న ముందున్న మేనాలోనుంచి ఒక యువతి దిగి, సుల్తానుతో తాను పద్మిని ప్రధాన చెలికత్తెనని చెప్పి, రాణీ తన భర్తకు ఆఖరిసారిగా వీడ్కోలు చెప్పదలిచిందనీ, అందుకు అనుమతి కావాలనీ అడిగింది. సుల్తాను సరేనన్నాడు.

మహాశూరుడైన గోరా, రాణీ పద్మినిలా వేషం ధరించాడు. రాణారతన్‌సింగు తనను సమీపించగానే గోరా తన ముసుగు తొలగించి, మేనాలలో వున్న వాళ్ళకు సైగ చేశాడు.





ఏడు వందల మేనాలలో స్త్రీ వేషాల్లో వున్న పధ్నాలుగు వందలమంది రాజపుత్ర సైనికులున్నారు. ఒక్కొక్క మేనాను సేవకుల దుస్తుల్లో మోసుకు వచ్చిన ఎనిమిదేసిమంది కూడా సైనికులే. వాళ్ళు ఆయుధాలను మేనాలలో దాచారు. గోరా సైగ చేయగానే వాళ్ళందరూ మెరుపు వేగంతో ఆయుధాలు చేతబట్టారు.




ఇది చూసి సుల్తానూ, అతడి సైనికులూ నివ్వెరపోయారు. రాణారతన్ సింగు కొందరు రాజపుత్ర యోధులతో దుర్గానికి పారిపోయాడు. రాజపుత్ర సైనికులు సుల్తాను గుడారాల మీద పడి బీభత్సం చేశారు. వాళ్ళు చాలా మంది శత్రువులను చంపి, శరణు అన్నవాళ్ళను వదిలిపెట్టారు.

చావగా మిగిలిన కొద్దిమంది సైనికులతో సుల్తాను, అక్కడి నుంచి పారిపోయాడు. ఆ రాత్రి చిత్తూరు దుర్గంలో రాజపుత్రులు విజయోత్సాహంతో వేడుకలు జరుపుకున్నారు.





తనకు జరిగిన అవమానం, అపజయం అలాఉద్దీనుకు రాజపుత్రులపై ఎక్కడలేని ద్వేషం కలిగించింది. అతడు లోగడ గుజరాత్, యితర ప్రాంతాలలో దోచిన ధనం వెచ్చించి, పెద్ద సైన్యాన్ని సమకూర్చుకోసాగాడు. పెద్ద పెద్ద జీతాలు ఆశగా చూపి, అతడు అత్యంత సమర్థులైన వాళ్ళను తన సైనిక ముఠాలకు నాయకులుగా నియమించాడు.

ఈ విధంగా రెండు సంవత్సరాల కాలంలో అలా ఉద్దీన్ గొప్ప సైన్యాన్ని సమాయత్తం చేసి, తిరిగి మరొకసారి చిత్తూరు దుర్గం మీదికి దాడి బయలు దేరాడు. ఇప్పుడు అతడి సైనికులకు మంచి ఆయుధాలతోపాటు, అత్యంత క్రూరులైన వాళ్ళ నాయకత్వం కూడా లభించింది.





అయినా రాజపుత్రులు భీతిల్లక సుల్తాను సైన్యాన్ని ధైర్యంగా ఎదిరించారు. గోరా, బాదల్ దుర్గ ప్రధాన ద్వారాల వద్ద, తమ సైనికులతో పాటు వీరోచితంగా పోరి మరణించారు. అదే విధంగా దుర్గంలోని సైనికులూ, రాజ కుటుంబంలోని ప్రతి ఒక్క పురుషుడూ శత్రువులతో జరిగిన భయంకర యుద్ధంలో చనిపోయారు.

శత్రువుల విజయవార్త వింటూనే రాణీ పద్మిని అగ్ని ప్రవేశం చేసింది. దుర్గంలోని స్త్రీలందరూ ఆమెను అనుసరించారు. అలాఉద్దీన్ దుర్గం ప్రవేశించి పద్మిని కోసం వెతికాడు. అతడికి కాలి చల్లారిపోతున్న చితిలోని బూడిద మాత్రం కంటబడింది.





# దౌర్భాగ్యం

ఒక ఊళ్ళో ఇద్దరు అన్నదమ్ములుండే వారు. పెళ్ళిళ్ళు చేసుకుని తమ తండ్రి ఆస్తిని సమంగా పంచుకుని వేరు వేరు కాపరాలు ఏర్పాటు చేసుకున్నారు. అయితే కొద్ది కాలంలోనే వారి అదృష్టాలు కూడా వేరయిపోయాయి. పెద్దవాడికి కుచేల సంతానంలాగా ఏటా పిల్లలు కలిగారు, ఆస్తి యావత్తూ పోయింది. రెండోవాడికి రోజులు కలిసివచ్చాయి, అతను సంపన్నుడయాడు.

చివరకు పెద్దవాడి పరిస్థితి భయంకరంగా పరిణమించింది. అతనికీ, భార్యకూ, పిల్లలకూ కట్టుకునేటందుకు సరిగా గోచిపాతలు కూడా లేవు. వారికి ఏ పూటా కడుపునిండా గంజి కూడా దొరికేది కాదు.

ఈ పరిస్థితిలో పెద్దవాడు అభిమానం చంపుకుని తమ్ముడి దగ్గిరికి వెళ్ళి, "తమ్ముడూ, నేనూ, పిల్లలూ పస్తులతో మలమల మాడిపోతున్నాం. దేవుడి దయ వల్ల నీకింత ఉన్నది గనక తోచిన సహాయం నాకు చెయ్యి. నాకింకెవరూ గతి లేరు!" అని ప్రాథేయపడ్డాడు.

రెండోవాడు కొంచెంసేపు ఆలోచించి, "సహాయం చెయ్యటానికేంగాని, ప్రస్తుతం నేను కూడా పెద్ద ఖర్చు మీద వేసుకున్నాను. రేపు నా పుట్టిన రోజు పండగ. అందుకని బ్రహ్మాండంగా విందొకటి ఏర్పాటు చేసి గొప్ప గొప్ప వారందరికీ ఆహ్వానాలు పంపాను. గొప్పవారిని పిలవనే గూడదు, పిలిచాక వారి హోదాకు తగ్గట్టు అతిథ్యం ఇచ్చి తీరాలి. ఎంత ఖర్చున్నదో నువే ఆలోచించు. ఈ పబ్బం గడిచాక చేతిలో మిగిలితే తృణమో, పణమో నీ చేతిలో పెట్టటానికి నా కేమీ అభ్యంతరంలేదు. రేపు విందుకు నువూ,

25 ఏళ్ళనాటి చందమామ కథ



వదినా, పిల్లల్నూ తప్పక రండి. ఈ సంగతి సందర్భాలన్నీ అప్పుడు వివరంగా మాట్లాడుకుందాం! రావడం మరిచేవు సుమా," అన్నాడు.

"నువు వైభవంగా పుట్టిన రోజు పండగ చేసుకుంటూంటే చింకిపాతలతో మేం కూడా దేనికిలే!" అన్నాడు అన్న విచారంగా.

"అదేం మాట? పేదరికం వచ్చినంత మాత్రాన మనం ఒక తల్లి పిల్లలం కాక పోతామా?" అన్నాడు తమ్ముడు.

అన్న పరమానందంతో ఇంటికి వెళ్ళి తన భార్యతో, "రేపు మా తమ్ముడి పుట్టిన రోజు. విందు జరుగుతున్నది. మనని దానికి రమ్మని ఆహ్వానించాడు," అన్నాడు.

"ఇంకా నయం! ఈ చిరుగుల బొంతలతో వెళితే మనని చూసి అందరూ నవ్వుతారు," అన్నది భార్య.

"పిలిచినప్పుడు వెళ్ళకపోవటం బాగుండదు. మన స్థితి లోకానికి తెలియదా?" అన్నాడు భర్త.

మర్నాడు అన్న కుటుంబం తమ్ముడి ఇంటికి వెళ్ళారు. ఇల్లంతా సంపన్నులైన అతిథులతో కళకళలాడుతున్నది. ఆ ఉత్సాహంలో అన్ననూ, అతని భార్యనూ, పిల్లల్నీ గమనించినవారు లేరు, ఆదరించినవారు లేరు. ఆఖరుకు నౌఖర్లు కూడా వారి కేసి చూడలేదు. భోజనాలకు కూచునేటప్పుడైనా వారి నెవరూ పిలవలేదు. కడ పంక్తిన కూడా వారికి చోటు లేకపోయింది,

అన్న ఆశ నిరాశగా మారింది. అయినా, ఆయన కుటుంబమూ కలిసి మాడుతున్న డొక్కలతో ఇంటికి బయలుదేరి వచ్చేశారు. దారిలో ఒక దౌర్భాగ్యుడు వారి వెనకే నడుస్తూ వచ్చాడు.

"మన వెనకగా ఎవరో నడిచి వస్తున్నారు. ప్రపంచమంతా మనను వదిలేస్తే వీడు మన వెంట పడ్డాడేమిటి?" అన్నది భార్య విసుగ్గా.

"వాడు మన దౌర్భాగ్యం అయి ఉంటాడు!" అన్నాడు భర్త.

అది నిజమే! ఆ మనిషి వాళ్ళ దౌర్భాగ్యమే. అదివరలో వాళ్ళు వాణ్ణి చూడలేదుగాని, వాడు మాత్రం వాళ్ళని చాలా కాలంగా వెన్నంటే ఉంటున్నాడు.

మర్నాడు అన్న ఇంట్లోనుంచి బయటికి రాగానే వాకిలి దగ్గిర కూచుని దౌర్భాగ్యం కనపడ్డాడు.

"చూడు, ఈ లోకంలో ఏమీ సుఖం లేదు. ఎందుకు విచారిస్తావు. వెళ్ళి సారాయి తాగి ఆనందించుదాం పద!" అన్నాడు దౌర్భాగ్యం అన్నతో.

"దానికి నా దగ్గిర డబ్బు లేదే!" అన్నాడు అన్న నిరుత్సాహంగా.

"నీ పాత గొంగళీ అమ్మ. చలికాలం వెళ్ళిపోయింది గద! మళ్ళీ చలికాలం వచ్చేదాకా బతికి ఉంటే చూసుకో వచ్చులే!" అన్నాడు దౌర్భాగ్యం.

అన్న లోపలికి వెళ్ళి పాత గొంగళి తెచ్చాడు. దాన్ని అమ్మగా వచ్చిన డబ్బులతో ఇద్దరూ తాగారు.

అది మొదలు అన్న ఇంట్లో ఉన్న ఒక్కొక్క వస్తువే అమ్ముతూ, ఆ డబ్బుతో తాగసాగాడు. దౌర్భాగ్యం రాత్రింబగళ్ళు తన వెంటే ఉంటున్నాడు. తనను మరింత గోతిలోకి తోస్తున్నాడు.



ఈ సంగతి అన్నకు తెలిసి కూడా ఏమీ చేయలేకపోయాడు.

కాని చిట్టచివరకు అన్నకు ఏమీ మిగల లేదు. ఎక్కడనన్నా కూలి చేసి రెండు డబ్బులు తెద్దామని అన్న అనుకున్నా దౌర్భాగ్యంనిరుత్సాహపరుస్తూ ఉండేవాడు.

"ఈ దౌర్భాగ్యానికి ఎదురు తిరిగితే తప్ప నేను బాగుపడను," అని చివరకు అన్న తీర్మానించుకున్నాడు.

ఒకనాడు వారిద్దరూ పొలాల మధ్యగా నడిచి వస్తుండగా ఒక బీడులో చాలా పెద్ద రాయి కనపడింది.

"ఇక్కడ ఎక్కడా కొండలు లేవే, ఇంత రాయి ఇక్కడికి ఎలా వచ్చింది?

ఎవరో కష్టపడి తెచ్చి ఉంటారు. ఒకవేళ దీనికింద ఏదైనా నిధి పాతి పెట్టారేమో!'' అన్నాడు అన్న.

''నీదంతా భ్రమ. ఇక్కడ నిధి ఎందుకుంటుంది? ఉంటే అది నీకంటా నా కంటా పడుతుందా? మన మొహాలకు అంత అదృష్టం కూడానా?'' అన్నాడు దౌర్భాగ్యం.

కాని అన్న ఇక వాడి మాటలు విన దలచలేదు; అతడు వెంటనే గ్రామానికి వెళ్ళి ఒక రైతు దగ్గిర ఎద్దులబండి అరువు తీసుకుని పొలంలో రాయి ఉన్న చోటికి వచ్చాడు.

దారి పొడుగునా దౌర్భాగ్యం నిరుత్సాహ పరుస్తూనే ఉన్నాడు. కాని అన్న వాడి మాటలు వినిపించుకోలేదు.

రాయి దగ్గిర బండి ఆపి, డిగి, అన్న దౌర్భాగ్యంతో, ''ఒక పట్టు పట్టు, ఈ రాతిని పక్కకు తోద్దాం!'' అన్నాడు.

ఇద్దరూ కలిసి రాతిని ఒక పక్కకు ఒరగదోశారు. అన్న అనుకున్నట్లే ఆ రాతి కింద చిన్న గొయ్యి ఉన్నది. దాని నిండా బంగారు కాసులున్నాయి.

ఇద్దరూ ఆత్రంగా ఆ బంగారాన్ని తోడి బండిలో పోశారు.

''ఇంకా ఏమైనా మిగిలి ఉందేమో చూడు!'' అన్నాడు అన్న.

''చూడక్కర్లేదు, ఇంకేమీ లేదు.'' అన్నాడు దౌర్భాగ్యం.

''గోతిలోకి దిగి జాగర్తగా వెతుకు. రెండు మూడు కాసులు మిగిలిపోయాయేమో, వాటిని మాత్రం ఎందుకు పోనివ్వాలి?'' అన్నాడు అన్న.

దౌర్భాగ్యం ఇష్టం లేకుండానే గోతిలోకి దిగి, వంగి లోపల తడువుతూన్న సమయంలో అన్న రాతిని యథాస్థానంలోకి తోసి, బండి ఎక్కి ఇంటికి వచ్చేశాడు. ఆయనకు దౌర్భాగ్యం పీడ వదిలిపోయింది.

ఆ తరవాత ఆయన ఏ కష్టాలూ లేకుండా భార్యాబిడ్డలతో సుఖంగా జీవించాడు.





# లక్ష్మిలాంటి కోడలు

రాధ వేకువజామునే లేచి, బిందె తీసుకుని, ఊరి చివరనున్న దిగుడుబావికి నీళ్ళ కోసం వెళ్ళింది. ఆమె నీళ్లల్లో బిందె ముంచుతూండగా, అది చేయి జారి, చూస్తుండగానే బావి అడుగుకు మునిగిపోయింది.

ఆమె జరిగిన దానికి బాధపడుతూ, మెల్లెక్కి పైకి వచ్చి, సాయం చేసేందుకు ఎవరైనా కనబడతారేమో అని చుట్టూ కలయచూడసాగింది.

హఠాత్తుగా ఒక యువకుడు దాపులనున్న గున్నమామిడి చెట్ల చాటునుంచి బయిటికి వస్తూ, ''ఊరంటే, మీ ఊరునే చెప్పాలి! ఈ చుట్టు పక్కల ఎక్కడా యిలాంటి ఊరులేదు. దాపుల్లో కొండలు, చుట్టూ పళ్ళతోటలు,'' అని ఆగి, రాధకేసి పరీక్షగా చూస్తూ, ''బాగా తెల్లవారక ముందే ఒంటరిగా యిటు రావడం, ఏదైనా ప్రమాదానికి దారి తీయొచ్చు కదా?'' అన్నాడు.

రాధ ఆ యువకుణ్ణి చూసి ఒక క్షణ కాలం విస్తుపోయి, అంతలోనే తేరుకుని, ''రోజూ, మా అత్తయ్య నీళ్ళు తెస్తుంది. ఆమెకు జ్వరం. నిద్ర లేస్తే నన్ను వెళ్ళనీయదని, చీకటితోనే వచ్చాను. అజాగ్రతవల్ల బిందె బావిలో మునిగిపోయింది. మీకు ఈత వచ్చా? బిందె తీసి పెడతారా?'' అన్నది.

''ఈతా? నేను గజ ఈతగాణ్ణి!'' అంటూ యువకుడు చొక్కా తీసి, చెట్టు కొమ్మకు తగిలించి, క్షణాల మీద దిగుడు బావిలోంచి నీళ్ళతో నిండిన బిందెను తెచ్చి, రాధ ముందు పెట్టాడు.

రాధ సంతోషంగా, ''మీరు చాలా సాయం చేశారండీ!'' అని బిందె ఎత్తుకుని ఇంటి దారి పట్టింది.

మాచిరాజు కామేశ్వరరావు



యువకుడు చొక్కా తొడుక్కుంటూ, ''ఇంతసాయం చేసినవాడికి, పేరే చెప్ప లేదు. నా పేరు కృష్ణ!'' అని కేకవేశాడు.

రాధ కూడా పెద్దగా, ''నా పేరు, రాధ!'' అని వడివడిగా ముందుకు నడిచింది.

మర్నాడు చీకటితోనే రాధ దిగుడు బావిలో నీళ్ళు ముంచుకుని మెట్లెక్కి వస్తుండగా, కృష్ణ దాపుల వున్న చెట్ల దగ్గిర ఆమెకు కనిపించాడు. ఆమె, అతణ్ణి చూడనట్టు తల తిప్పుకుని వెళ్ళి పోతూండగా, ''మీ అత్తయ్యకు జ్వరం తగ్గకూడదని మొక్కుకున్నాను. దేవుడు నా ప్రార్థన విన్నాడు, మళ్ళీ నిన్ను చూడ గలిగాను,'' అన్నాడు నవ్వుతూ.

''తోటివాళ్ళను బాధించడానికా, దేవుళ్ళకు మొక్కడం?'' అన్నది రాధ కోపంగా.

''సరే, నా మొక్కుల వల్ల బాధపడేది నువ్వా, మీ అత్తయ్యా?'' అని అడిగాడు కృష్ణ నవ్వుతూ.

''మా అత్తయ్యకు మీ గురించి ఏమీ తెలియదు, తెలిస్తే తోకతొక్కిన పాములా లేస్తుంది. మా వంశంలో ఆడవాళ్ళిలా, ఎరగని వాళ్ళతో కబుర్లాడరు,'' అని, రాధ వేగంగా ఊరుకేసి నడిచింది.

మరి నాలుగు రోజులపాటు కృష్ణ, రాధను బావి దగ్గిర కలుసుకుని మాట ల్లోకి దించాడు.

''నేను రేపు మా వూరు వెళ్ళి పోతున్నాను. ఎంతో అందమైన ప్రకృతి గల, యీ ఊరు నాకు నచ్చింది; నువ్వు అంతకన్నా కూడా నచ్చావు. మా వాళ్లను తీసుకువచ్చి, మీ వాళ్ళతో మాట్లాడి, నిన్ను శాశ్వతంగా మా ఊరు తీసుకు పోతాను,'' అన్నాడు కృష్ణ ఒకనాటి ఉదయం రాధతో.

రాధ జవాబేమీ యివ్వకుండా తడబడు తున్న అడుగులతో ఇల్లు చేరింది. ఆమె మనసంతా వికలమైపోయింది. అలాంటి సమయాల్లో ఆమె, పక్క ఇంట్లో వున్న

స్నేహితురాలు విమల దగ్గరకు పోయి కాలం గడిపేసేది.

ఆ రోజు రాధ వాలకం చూసిన విమల సంగతేమిటని అడిగింది. రాధ, ఆమెకు కృష్ణను గురించి వివరంగా చెప్పి, "అతను, నన్ను పెళ్ళాడతాడట!" అన్నది.

"అలాగా! ఎంతగానో సంతోషించ దగిన సంగతి, అలా నిరుత్సాహంగా వున్నావేం?" అని అడిగింది విమల.

"అతను రక్షకభటుల కళ్ళు కప్పి తిరుగుతున్న దొంగ!" అన్నది రాధ బాధపడుతున్నట్టు.

ఆ జవాబుకు నిర్ఘాంతపోయి చూస్తున్న విమలకు, రాధ తన దగ్గిర దాచి వుంచిన ఒక చీటీ యిచ్చింది అందులో, "కృష్ణా, నీ కోసం రక్షకభటులు తిరుగుతున్నారు. ఏదైనా మారుమూల గ్రామానికి వెళ్ళిపో," అని రాసి వున్నది.

"ఈ చీటీ నాకు మొదటి రోజునే, చెట్టుకొమ్మకు తగిలించిన అతడి చొక్కా జేబులోంచి కిందపడి దొరికింది," అన్నది రాధ విమలతో.

విమల ఒకక్షణం ఆలోచించి, "అతడు దొంగ అని తెలిసీ, రోజూ నువ్వతడితో మాట్లాడుతున్నావంటే, నీకూ మనసులో అతడు యిష్టమయే వుండాలి. రేపు ఒక పని చెయ్యి. పెళ్ళికి ముందు ఒకళ్ళను గురించి, మరొకరు పూర్తిగా తెలుసుకోవడం మంచిది. మీ గురించి వివరంగా





చెప్పండి, అని అడుగు. అతను ఏం చెబుతాడో చూద్దాం,'' అని సలహా యిచ్చింది.

మర్నాడు రాధ, కృష్ణను అదే ప్రశ్న అడిగింది. అతను చిన్నగా నవ్వి, ''బావుంది. నిన్ను గురించి ఏం చెప్పావు? తల్లిదండ్రుల్లేని నిన్ను, మీ అత్తయ్య నానా యాతనలూ పెడుతున్నదన్న నిజం నాకు చెప్పావా?'' అన్నాడు.

ఆ మాట వింటూనే, రాధ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె రెండు చేతులతో మొహం దాచుకున్నది.

కృష్ణ ఆమెను ఓదార్చుతూ, ''నీ గురించి వివరాలు తెలుసుకున్నాకే, నిన్ను పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. కష్టాలన్నీ దిగమింగుకుని, పైకి నవ్వుతూ ఎలా వుండగలుగుతున్నావు?'' అని అడిగాడు.

''తప్పని సరైతే, కష్టాలు అనుభవించేందుకు ఎవరూ జంకకూడదు. నలుగురికీ నా బాధలు చెప్పుకుని చులకన కావడం నా కిష్టంలేదు,'' అన్నది రాధ దృఢస్వరంతో.

''అలాంటి మంచి లక్షణాలు చూసే గదా, నిన్ను వివాహమాడాలనుకున్నాను,'' అన్నాడు కృష్ణ.

రాధ అతడి కేసి చురచుర చూస్తూ, ''మీరనే అంత మంచి లక్షణాలు గలదాన్ని, దొంగను చేసుకుంటానని ఎలా అనుకున్నారు?'' అని అడిగింది.

ఆ ప్రశ్నకు నివ్వెరపోయి చూస్తున్న కృష్ణకు, రాధ తనకు లోగడ దొరికిన చీటీ యిచ్చింది. అది చదువుకుని అతను పెద్దగా ఒకసారి నవ్వి, ''ఈ చీటీలో వున్నది, నన్ను గురించే. అయితే, ఎవరు రాశారో, ఎందుకు రాశారో చెబుతాను,'' అంటూ యిలా చెప్పాడు:

అతను లక్షాధికారి కొడుకు. తండ్రికి తగని ధనవ్యామోహం. తల్లి యిందుకు పూర్తిగా వ్యతిరేకం. కృష్ణ తండ్రి, ఇంట్లో ఎవరితోనూ సంప్రతించకుండా, ఆ ఊరిలో

కెల్లా పెద్ద వ్యాపారస్థుడి కుమార్తెతో అతడి పెళ్ళి నిశ్చయం చేశాడు. ఆ అమ్మాయి పరమకురూపి!

కృష్ణకు ఆ పెళ్ళి చేసుకోవడంకంటే, సన్యాసుల్లో కలిసిపోవడం మంచిదని పించింది. తల్లి అతడితో, "ఇక నాలుగు రోజుల్లోనేకదా ముహూర్తం. నువ్వు ఈ నాలుగు రోజులూ ఏ స్నేహితుడి ఇంట్లోనో దాక్కో. ముహూర్త సమయం వరకూ చూసి, నువ్వు కనబడకపోతే, ఆ అమ్మాయి తండ్రి పంతానికయినా, అడిగినంత కట్నం గుమ్మరించి, మరెవరికో కూతుర్ని అంటగట్టేస్తాడు. పీడా విరగడ అవుతుంది!" అని చెప్పింది.

కృష్ణ ఊళ్ళోనే వున్న ఒక స్నేహితుడి ఇంట్లో దాక్కున్నాడు. అయితే, ఊహించని విధంగా కృష్ణ తండ్రి, తన కొడుకు కనబడడం లేదంటూ అధికారులకు ఫిర్యాదు చేశాడు. ఈ సంగతి తెలిసిన కృష్ణ తల్లి, ఊళ్ళోనే వుంటే రక్షక భటులు వెదికి పట్టుకుంటారని, కొడుక్కు మరేదైనా దూర గ్రామం పారిపొమ్మని చీటీ రాసి, నౌకరు ద్వారా పంపింది.

"ఇదీ, నా అసలు కథ! ఆ చీటీ చూసి నేను దొంగనని భ్రమపడ్డావు. నిజం తెలుసుకున్నావుగదా, నాతో వివాహం సమ్మతమేనా? ఇంకేమైనా అభ్యంతరాలున్నాయా?" అని అడిగాడు కృష్ణ, తల వంచుకుని నేలచూపులు చూస్తున్న రాధను.

"నేను మూర్ఖురాలినో, అమాయకురాలినో తెలుసుకోగలిగినంత తెలివితేటలు నాకు దేవుడిచ్చాడు కాదు!" అంటూ రాధ చిన్నగా నవ్వింది.

"ఆ సంగతి పెళ్ళయాక, మా అమ్మనడిగితే చెబుతుంది. మా నాన్న మాత్రం, లక్ష్మిని వెంట తెచ్చే కోడలు రాకపోయినా, లక్ష్మిలాంటి కోడలు వచ్చిందని తప్పక సంతోషిస్తాడు. ఇప్పుడే బయలుదేరి వెళ్ళి, మా అమ్మా, నాన్నలను వెంటబెట్టుకు వస్తాను," అని, కృష్ణ అక్కడి నుంచి కదిలాడు.



# దురదృష్టం

గోపాలశర్మ అనే అతను దేశాటన చేస్తూ, బలవంతవర్మ పాలిస్తున్న విజయపురి రాజ్యం చేరాడు. అక్కడ ఒక గ్రామం పొలిమేరల్లో నలుగురు దొంగలు అతణ్ణి అటకాయించి వున్నదంతా దోచుకుపోయారు.

శర్మ గ్రామంలోకి పోయి, గ్రామాధికారికి దొంగలను గురించి చెప్పాడు. గ్రామాధికారి శర్మ కేసి కోపంగా చూస్తూ, "దొంగల వృత్తే దోపిడీలు చేయడం. లేకపోతే వాళ్ళెలా బతకాలి!" అని, గోపాలశర్మనే నాలుగు తిట్టి పంపేశాడు.

శర్మకు ఆ రాజ్యం మీదా, దాన్ని పాలిస్తున్న రాజు బలవంతవర్మ మీదా పట్టరాని కోపం వచ్చింది. అతడు రాజధాని చేరుతూనే, "బలవంతవర్మ రాజపదవికి తగడు, వట్టి మూర్ఖుడు! దేశాన్ని దొంగలూ, దారి దోపిడీగాళ్ళూ ఏలుతున్నారు," అంటూ కేకలు వేశాడు.

రాజభటులు అతణ్ణి పట్టుకుపోయి బలవంతవర్మ ముందు నిలబెట్టారు. రాజ దూషణకుగాను అతడికి పది సంవత్సరాల కారాగార శిక్ష విధించబడింది.

గోపాలశర్మ పది సంవత్సరాల కాలం కారాగారంలో గడిపి విడుదలై, ఉత్సాహం ఆపుకోలేక, "రాజు బలవంతవర్మ వివేకి, మహాజ్ఞాని. జై, బలవంత మహారాజులుంగారికి!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

రాజభటులు అతణ్ణి మళ్ళీ పట్టుకున్నారు. శర్మకు యీసారి ఇరవై ఏళ్ళ కారాగార శిక్ష విధించబడింది. అతడు ఆశ్చర్యపోయాడు.

గోపాలశర్మ కారాగారంలో వుండగా ఆ దేశ సేనాని, రాజు బలవంతవర్మ మీద తిరుగుబాటు చేసి, తానే రాజయ్యాడు. ఈ సంగతి శర్మకు తరవాత తెలిసింది.

—మహబూబ్ బాషా





# రహస్యం దాచే రహస్యం!

అనంతపురం జమీందారు కులశేఖరం గారికి, భార్య అంటే అపరిమితమైన అనురాగం. ఎంతటి ముఖ్య రహస్యాలైనా, ఆమెకు చెప్పకుండా వుండలేక పోయేవాడు. అయితే, భార్య మూలంగా రహస్యాలు నలుగురికీ తెలిసిపోయేవి. ఈ విషయమై కులశేఖరం భార్యను ఎంత హెచ్చరించినా ప్రయోజనంలేకపోయింది. ఆమె నోట్లో నువ్వుగింజ కూడా నానదు.

జమీందారుకు రాముడు, సోముడు అని యిద్దరు నమ్మకస్థులైన నౌకర్లున్నారు. జమీందారు వీళ్ళకు కూడా తన రహస్యాలు కొన్ని చెబుతూండేవాడు. రాముడికి చెప్పిన రహస్యాలు అందరికీ వెల్లడయ్యేవి; సోముడికి చెప్పినవి ఎవరికీ తెలిసేవికాదు.

కులశేఖరంగారు, రాముణ్ణి చాలా పర్యాయాలు కోప్పడితే, వాడు, "ఈ రహస్యాలు నేను, నా భార్యకు తప్ప మరెవరికీ చెప్పడంలేదు. ఏం చేసేది! దాని నోట్లో నువ్వుగింజ నానదు," అని జవాబిస్తూండేవాడు.

ఇదే లోపం తన ఇంట కూడా వుండడంవల్ల, జమీందారు తన నౌకరును ఏమీ అనలేకపోయేవాడు.

ఒక రోజు ఆయన సోము డొకణ్ణీ పిలిచి, "తాళి కట్టేనాడు, అందరిలాగే నువ్వూ, భార్యతో కష్టసుఖాలన్నీ పంచుకుంటానని మాట యిచ్చావు. అలాంటప్పుడు, నీకు తెలిసిన రహస్యాలన్నీ, నీ భార్యకు చెప్పకపోవడం న్యాయమేనా?" అని అడిగాడు.

"నేనెందుకు చెప్పను, ప్రభూ! నాకు తెలిసినవన్నీ, దాచకుండా నాభార్యకు రోజూ చెబుతూంటాను," అన్నాడు సోముడు.

జమీందారుకు సోముడు అబద్ధం చెబుతున్నాడన్న అనుమానం కలిగింది.

—జొన్నలగడ్డ రామలక్ష్మి

నిజం తెలుసుకునేందుకు, ఆయన తన నౌకర్లిద్దరికీ ఒక పరీక్ష పెట్టాడు.

ఒక రోజు ఆయన సోముడితో, "నాకు కడుపులో ఏదో వ్రణం పుట్టిందనీ, ఆట్టే కాలం బతకననీ, మన దివాణం వైద్యుడు చెప్పాడు. త్వరలో వారసుణ్ణి ఎన్నిక చేయాలి. ఇది చాలా రహస్యం!" అన్నాడు.

సోముడు వెళ్ళిపోగానే రాముణ్ణి పిలిచి, "ఇది చాలా రహస్యం! రెండు రోజుల క్రితం విరోధులు కుట్రపన్ని, నా ఆహారంలో విషం కలిపించి దొరికి పోయారు. ప్రస్తుతానికి, ఆ కుట్రదార్ల పేర్లు రహస్యంగా వుంచాను," అని చెప్పాడు.

వారం రోజుల్లో రాముడికి చెప్పిన రహస్యం బయిటికి పొక్కింది. సోముడికి చెప్పిన దాన్ని గురించి ఎవరూ మాట్టాడుకోలేదు.

జమీందారు తన ఇంట పనిచేసే దాసీ నొకదాన్ని సోముడి భార్య వద్దకు పంపి, తన అనారోగ్యం గురించి, ఆమె కేపాటి తెలుసో కనుక్కోమన్నాడు. దాసీ తిరిగి వచ్చి "ప్రభూ, ఈ విషయం వారం రోజుల క్రితమే తనకు తెలుసునని, సోముడి భార్య అన్నది," అని చెప్పింది.

ఇదివిని కులశేఖరం ఆశ్చర్యపోయాడు. ఆయన సోముణ్ణి పిలిచి, "ఈ రోజుల్లో, నీ భార్యవంటి ఆడవాళ్ళు అరుదుగా వుంటారు," అని, జరిగింది చెప్పి, మెచ్చుకున్నాడు.

దానికి సోముడు నవ్వి, "ఇందులో వింతపడవలసిం దేమీలేదు, ప్రభూ! ఎవరికైనా రహస్యమని ప్రత్యేకంగా చెబితేనే, అది నలుగురికీ చెప్పాలన్న కోరిక కలుగుతుంది. నేను, నా భార్యకు రహస్యాలన్నీ చెబుతాను. కాని, అవి రహస్యాలని మాత్రం అనను! అందుచేత, ఆమె వాటిని పట్టించుకోదు," అన్నాడు.

అసలు రహస్యం జమీందారుకు అర్థమయింది. ఆయన సోముడికి మంచి బహుమానం యిచ్చాడు. ఆ తర్వాత ఆయన భార్యకు చెప్పిన రహస్యాలు కూడా బయిటికి పొక్కడం ఆగిపోయింది.





# విఘ్నేశ్వరుడు

అవ్వ ఒకరోజున ఫలవృక్షాలతో నిండివున్న మార్గంగుండా వెళ్తూండగా ఒక అందమైన బాలకుడు చెట్టుమీద కూర్చుని పాడుకుంటున్నాడు. చెట్టునిండా పళ్ళు విరగపండి వున్నవి.

ఆ కుర్రవాణ్ణి పలకరించి మాట్లాడాలని అవ్వకు బుద్ధిపుట్టింది. ''నాయనా! ఒక పండు యిలా పడెయ్యవూ! నోరూరుతున్నది,'' అని అన్నది.

బాలుడు నవ్వుతూ, ''అవ్వా! ఏ పండు కావాలి? చెట్టు నిండా రకరకాల పళ్ళున్నవి. ముసలితనాన్ని పోగొట్టే పండు యిమ్మంటావా? మృత్యువుని దూరంజేసే పండా? ధనరాసుల్నిచ్చే పండా? ఎలాంటి పండు కావాలి?'' అన్నాడు.

అవ్వకు ఆ బాలుడు సుబ్రహ్మణ్యేశ్వరుడే అని తెలిసిపోయింది. ఆమె చేతులెత్తి మ్రొక్కుతూ, ''సుబ్రహ్మణ్యస్వామీ! ఎంత పంచినా తరగని అపార జ్ఞాన సంపదనిచ్చే పండు యివ్వు, తండ్రీ! జ్ఞానఫలాన్ని అనుగ్రహించు!'' అంటూ సాగిలపడింది.

సుబ్రహ్మణ్యస్వామి నిజరూపంతో దండాన్ని ధరించి నెమలిపై సాక్షాత్కరించాడు. అవ్వ శిరస్సు బళ్ళెపు మొనతో సుతారంగా తాకి అనుగ్రహించాడు. అవ్వకు ఒక్కసారిగా విశ్వస్వరూపమైన ఓంకార తత్వము, బ్రహ్మ జ్ఞానము, జీవన్ముక్తి మార్గము తెలిసి అపారమైన జ్ఞానం కలిగింది. సుబ్రహ్మణ్యేశ్వరుడు

22. సహస్రసేకు గణపతి



అవ్వను ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు.

అవ్వ కాలినడకను ఊరూరా, వాడవాడా జ్ఞానాన్ని, భక్తిని, ఉత్తమ జీవన ధర్మాలను సామాన్యులకు తెలిసే మాటలలో ప్రబోధిస్తూ దేశసంచారం చేసింది.

అవ్వ నోటి నుంచి వచ్చిన మధుర వాక్కులు కవితలాగ గీతాలై ప్రజాసామాన్యంలో వ్యాప్తిపొంది చిరస్థాయిగా నిలిచాయి.

అవ్వ అలావెళ్తూ చీకటిపడ్డ వేళకు ఒక అరణ్య మార్గానికి వచ్చింది. ఆకాశంలో మేఘాలు దట్టంగా క్రమ్ముకొచ్చాయి. చిట్టచీకటిగా వుంది. ఉండి, ఉండి మెరుస్తున్నది. తుప్పర పడుతున్నది. అవ్వ కాలికి రాయి తగిలి పడిపోయింది. చేతనున్న ఊతకర్ర దూరంగా పడింది.

ఆ చీకటిలో ఎవరో వస్తున్న పాదధ్వని మధురంగా వినిపించింది. అవ్వ తల ఎత్తి చూసింది. అప్పుడే మెరిసింది. మెరుపు వెలుగులో ముద్దుగా, బొద్దుగా దోరపు బొజ్జతో ఒక బాలుడు కనిపించాడు. ఆ బాలుడు అవ్వను లేవనెత్తి కర్రతెచ్చి అందించాడు. అవ్వ పట్టిన కర్రను బాలుడు కదలకుండా పట్టుకుని, ''అవ్వా! ఎక్కడికి వెళ్తున్నావు? ఏ క్షేత్రం చూడాలని వెళ్తున్నావు? ఏ తీర్థం సేవిస్తావు?'' అని అడిగాడు.

''నాయనా! నాకు యీ పుడమి అంతా ఒకే ఒక దివ్యక్షేత్రం. ప్రత్యేకంగా క్షేత్రాలు, తీర్థాలు సేవించాలని నాకులేదుగాని నేను చేరవలసిన క్షేత్రాన్ని ఎలాగ చేరాలో దారి కనిపించడం లేదు. ఇంతకూ నువ్వెవరో ఏమిటో! పసివాడివి యీచీకటిలో వస్తున్నావెందుకు?'' అని అవ్వ అన్నది.

''అవ్వా! నేను నీ ఆబాల్య సన్నిహితుణ్ణి. పుట్టినప్పట్నించీ నన్నెరిగున్న దానివే, చీకటిలో గుర్తించ లేకపోతున్నావు! ఇంతకూ నువ్వు చేరాలనుకుం

టున్న ఆ క్షేత్రం ఏమిటో చెప్పావుకాదు!'' అన్నాడు బాలుడు.

''చెప్పి ఏంలాభం! తీసుకెళ్తావా? అది శివసన్నిధానం అనే మహాక్షేత్రం!'' అన్నది అవ్వ.

''ఓష్! ఈ మాత్రందానికేనా, అదెంత పని నాకు! నీ చెయ్యి పట్టుకొని తీసుకెళ్తాను, పద!'' అంటూ బాలుడు అవ్వ చేతిని పట్టుకొని అడుగు వేశాడు. రెండో చేత ఊతకర్రతో అవ్వ అడుగు ముందుకు వేయబోతుండగా పెద్ద మెరుపు మెరిసింది. ఆ కాంతిలో తన చేతిని తొండంతో పట్టుకొని నడిపించే విఘ్నేశ్వరుణ్ణి చూసి అవ్వ కన్నులు మూసి, ''దేవా! చిన్ననాటి నుంచీ నువ్వేనడిపిస్తున్నావు, నేను కన్నులు మూసుకున్నా తెరిచినా ఒకటే!'' అని అనుకుంటూ కళ్ళు తెరవకుండానే విఘ్నేశ్వరుడు ఎక్కిస్తూ తీసుకెళ్తూంటే ఎన్నో ఎన్నో మెట్లు ఎక్కుతూ, అలా ఎంత కాలం గడిచిందో తెలీకుండా వెళ్ళింది.




అలా వెళ్ళగా వెళ్ళగా, ''అవ్వా! శివసాన్నిధ్యాన్ని సమీపించాము!'' అని అన్న విఘ్నేశ్వరుని మాటకు అవ్వ కన్నులు తెరిచి చూసింది.

అక్కడ వెలుగు తప్ప మరేమీ కనిపించలేదు. క్రిందికి చూస్తే అనేక నక్షత్ర మండల సముదాయాలు సోపానపంక్తుల్లాగ కనిపించాయి. ఎన్నెన్నో సూర్యకుటుంబాలు, తోకచుక్కలు, వాయురూపంలో తిరుగుతూ పెరుగుతూన్న జ్యోతులు, వెలుగు చక్రాల్లాగ గిర్రున తిరుగుతున్న తేజోమండలాలతో నిండిన అనంత విశ్వం పాదాల దిగువ కన్నులపండువుగా వున్నది.

విఘ్నేశ్వరుడు అవ్వ చేతిని వదలి, ''అవ్వా! శివసన్నిధానాన్ని చేరుకున్నావు. ఇక్కడ కాలం అనేది లేదు. నాశము అనేది లేదు. ఇదే సృష్టి స్థితిలయాలకు అతీతమైన శివుని సన్నిధానం, అసలు కైలాసం! విశ్వనాథుడు విశ్వేశ్వరుడైన శివుణ్ణి దర్శించు!'' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.



అవ్వకు లింగాకారంగా మీదకూ కిందకూ ఒకేలాగ వ్యాపించి ఉన్న గొప్ప జ్యోతి కనిపించింది. ఆ జ్యోతిలో ప్రమథ గణాలు చేస్తున్న స్తోత్రం ఓంకారధ్వనిగా వినిపిస్తున్నది. విశ్వేశ్వరుడైన శివుడు కనిపించాడు. అతనికిరుపక్కలా, విఘ్నేశ్వరుడు, పార్వతి కుమారస్వామి, నంది మొదలైన వారంతా ఉన్నారు.

అవ్వకు శివసాక్షాత్కారమైంది. శివుడు ప్రీతితో తన అభయహస్తాన్ని అవ్వ తలపై ఉంచి అనుగ్రహించాడు. ఆ విధంగా అవ్వ శివసాయుజ్యాన్ని పొందింది.

మంటప చిత్రాల్లో, చెరుకుగడ పట్టి ఉన్న విఘ్నేశ్వరుడిని ఒక రైతు కుతూహలంగా చూస్తూండడం గమనించి పాపన మిశ్రుడు కథ ఆరంభించాడు:

రాజంతటి భూస్వామి ఒకడు ఏటేటా వినాయక పూజలు, ఉత్సవాలు ఘనంగా జరిపిస్తూ, గణేశభక్తశిరోమణి అనిపించుకున్నాడు. అతనికి అనేక పంటపొలాలతో బాటు పెద్ద చెరుకుతోట ఉంది.

ఆ చెరుకు తోట పని అంతా చూసుకుంటూ ప్రతి ఏటా పుష్కలంగా చెరుకు పండించి భూస్వామికి మంచి రాబడి చేకూర్చే పాలేరు, మనస్సులో విఘ్నేశ్వరుణ్ణి నమ్మిన భక్తుడు. "ఈసారి మరింత బాగా పండించు గణేశా!" అని మనస్సులో మొక్కుతూ చెరుకునాటి ఏడాదికేడాది తన యజమానికి మరింత లాభం చూపించేవాడు.

పాలేరూ అతని భార్యా, పదేళ్ళ కొడుకూ ముగ్గురూ చెమటోడ్చి పని చేసేవారు. భూస్వామి మాత్రం చాలా తగ్గించి కూలి ఇచ్చేవాడు, అదీ సరిగా ఇచ్చేవాడుకాదు. పాలేరు అమాయకుడు, అల్ప సంతోషి. ఏమీ అనేవాడు కాడు.

భూస్వామి భార్య ఉత్తమురాలు, మంచి అయినా చెడ్డ అయినా మనస్సులో గణేశుడికే నివేదించుకొనేది. పాలేరుకి కూలి యివ్వడంలో భర్త మరీ అన్యాయం చేస్తూంటే, "పాపం, వాళ్ళు పడే కష్టా

నికి మీరిచ్చేది ఏ మాత్రం? సరిగా యివ్వండి!'' అనేది.

''బాగానే ఉంది నీ బోడి సలహా! ఇలాగ మిగుల్చుకుంటూ వస్తేనే గదా మనం గణేశఉత్సవాలు జరిపించేది!'' అనేవాడు భూస్వామి.

ఆమె ''కష్టపడేవాళ్ళ నోట మట్టి గొట్టి పూజలూ, ఉత్సవాలూ జరపకపోతేనేం? గణేశా, ఈయనకు మంచిబుద్ధి కలిగించు!'' అని అనుకునేది.

ఆ ఏడాది చెరుకు ఏనుగుతొండాల్లాగ మరింత విశేషంగా పండింది. వెయ్యేసి చెరుకులు కట్టిన మోపులు బళ్ళతో భూస్వామి దివాణం చేరుతున్నాయి.

''అంతా గణేశ్వరుడి దయ. ఊరికే పోతాయా, పూజలూ ఉత్సవాలూ. మరి దేనికి చేయిస్తున్నాం!'' అన్నాడు భూస్వామి.

''అంతే గాని మన పాలేరు శ్రమ ఏమీ లేదంటారు, అంతేనా?'' అని భార్య అన్నది.

''బాగానే ఉంది నీ వల్లమాలిన జాలి! అలా పాలేర్లనూ, జీతగాళ్ళనూ వెనకేసుకొస్తే మనం కూడా వాళ్ళ వెనకే వెళ్ళవలసి వుంటుంది. ఈ మనుషుల్లో ఏముంది. అంతా ఆ వినాయక దేవుడి మహిమ!'' అన్నాడు భర్త.



''ఓ విఘ్నేశ్వరా! ఈయనకు జ్ఞానోదయం కలిగించవలసింది నీవే!'' అని ఆమె మనసులో ప్రార్థించింది.

పాలేరు కొడుక్కి విఘ్నేశ్వరుడంటే ప్రాణం. వినాయకచవితికి తెల్లకలువలూ, ఎర్రతామరలూ, పూలూ, పత్రీ ప్రతి ఇంటికీ పూజకు తెచ్చి యిచ్చేవాడు.

వినాయక చవితి వచ్చింది. కుర్రవాడి ప్రాయంతోబాటు బుద్ధి కూడా ఎదుగుతున్నదేమో, వాడు చెరుకు మోపుల్ని భూస్వామి దివాణానికి చేరవేయిస్తున్న తండ్రి దగ్గిరికెళ్ళి, ''నాన్నా, మనం కూడా వినాయకుడికి పెట్టుకుందాం. ఒక చెరుగ్గెడ తీసుకెళ్తా!'' అన్నాడు.



పాలేరు ఒక చెరుకు తీసి కొడుక్కిచ్చాడు. వాడు దాన్ని ఇంటికి తీసుకెళ్తున్నాడు. అది భూస్వామి కంట బడింది.

భూస్వామి ఉగ్రనరసింహావతారుడై, "ఏమిరా, నా చెరుకంతా నీ ఇంటికి చేరవేయిస్తున్నావా?" అంటూ పాలేరుపై విరుచుకుపడి నానా మాటలూ అంటూ, కొరడాతో కొడుతూంటే, భూస్వామి వెంటనున్న పరివారమూ, గ్రామస్థులూ చూస్తూ ఊరుకున్నారే గాని కిక్కురుమనలేదు. భూస్వామి పలుకుబడి అలాంటిది! అతడేం చేసినా చెల్లుతుంది, ఎదురు తిరిగి అడిగేవాడు లేడు.

పాలేరు తాళుకోలేక, "చవితి కదా వినాయకుడికి పెట్టుకుందామని పట్టుకెళ్ళమని యిచ్చాను, ఒక్కటంటే ఒక్క చెరుకు.....!" అన్నాడు.

భూస్వామి, "ఏమిటీ! మీ జాతి తక్కువ వాళ్ళకి పూజలూ, వినాయకుడూనా?" అన్నాడు.

పాలేరు, "కడజాతి అయితే అయింది గాని, దేవుడూ భక్తీ ఉండవా?" అన్నాడు.

భూస్వామి హేళనగా, "నీ ముఖానికి భక్తి కూడానా! నక్కకూ, నాకలోకానికీ ఉన్నంత దూరం! చెరుగ్గెడ పట్రా!" అన్నాడు.

పాలేరు, "ఒక్క చెరుకు కోసం అలా రాపాడిపోతారేమయ్యా? బళ్ళతో చెరుకు దింపుకున్నది చాలదా, ఒక్క చెరుకుతో ఏం బావుకుంటావయ్యా?" అన్నాడు.

భూస్వామి, "ఎంత మాట కూశావురా! ఒకటి కాదు పది కాదు వెయ్యి చెరుకులైనా నాకు పూచికతో సమానం తెలుసా! తెల్లవారే సరికి నువ్వు వెయ్యి చెరుకులు తినాలి! నమిలిన పిప్పి అంతా పోగు కనిపించాలి! లేకుంటే చెరుకొక్కంటికి వెయ్యి కొరడా దెబ్బలు తింటావు, తెలిసిందా!" అంటూ పాలేరును పెడరెక్కలు విరిచి కట్టించి, భృత్యులచేత వాణ్ణి బందీలాగ చెరుకు

నిలవచేసే సాలలో త్రోయించి, వెయ్యి చెరకుల మోపు ముందు పడ వేయించాడు.

భూస్వామి గొప్ప తిక్కమనిషి, ఎంత తోస్తే అంత. పాలేరు నుంచిన సాల చుట్టూరా భటుల్ని కాపలా పెట్టాడు.

భూస్వామి భార్య, "విఘ్నేశా! పాలేరు ఉత్త అమాయకుడు. చెరుకు తినడానికి పూనుకుంటే పాపం నిష్కారణంగా చస్తాడు. తినకపోతే నా భర్త దెబ్బలు కొడతాడు. వాణ్ణి ఎలాగ కాపాడతావో మరి!" అని మనసులో అనుకొంది.

పాలేరుకి ఏమీ తోచలేదు. చేసేదిలేక విఘ్నేశ్వరుణ్ణి తలచుకొంటూ, చీకటిపడే వేళకు అలాగే నిద్రలో పడిపోయాడు.

తెల్లవారుతూనే భూస్వామి వెళ్ళి చూస్తే, తెల్లగా హిమాలయపర్వతంలాగ చెరుకు పిప్పిపోగు కనిపించింది. భూస్వామి దెయ్యం పట్టినవాడిలాగ పెద్ద కేకపెట్టి, తెరిచిన నోరు తెరిచినట్టే ఉండిపోయాడు.

ఆ కేక విని వచ్చిన భార్యతో భూస్వామి, "అంతా సర్వనాశనం! సాలలో ఒక్క చెరుకు మిగలకుండా అంతా పిప్పి పిప్పి! పాలేరు కాదు, భూతం! వాడు మనల్ని తినేస్తాడు, పద!" అంటూ అరుస్తూంటే, ఆమె నవ్వి, "వాడు భూతమూ కాదు, తిననూలేదు! నేను కళ్ళారా చూశాను. అప్పటికింకా తెల్లారలేదు. ఏనుగ ఘీంకారం విని, కిటికీ లోంచి చూశాను. పెద్ద ఏనుగు చెరుకు మేస్తూ కనిపించి మాయమైంది!" అన్నది.

"ఏనుగేమిటి, నీ మొహం! యీ చుట్టుపక్కల ఏనుగన్నది ఉన్నట్టు వినలేదు," అని భూస్వామి అంటూండగా, కొంత మంది వినాయక ఉత్సవశాల నుండి పరుగున వచ్చి, "రాత్రినుంచీ పందిట్లో పూజలో పెట్టిన వినాయక విగ్రహం కనిపించటంలేదు. అంతటా వెతికాము," అని చెప్తూనే సాలలోకి చూస్తూ, "అదుగో, విగ్రహం, అదుగో!" అంటూ అటు కేసి వెళ్ళారు.





# పరోపకారి దయ్యాలు

సామ్రాజ్యం అత్త గంగమ్మ చండశాసనురాలు. కోడళ్ళందరిలోకీ ఆమె తక్కువ కట్నం తెచ్చిందని ఎప్పుడూ సాధిస్తూండేది. సామ్రాజ్యానికి పుట్టింటి తరఫున ఒక్క అన్న తప్ప మరెవ్వరూలేరు. వదిన పరమ పిసినారి. భర్త కూడా కొలత ప్రకారం అన్నం పెట్టే తరహా మనిషి. ఆ కారణం వల్ల గంగమ్మ మిగతా కోడళ్ళు పండగలకు పుట్టిళ్ళకు వెళ్ళి, చీరా సారే తెచ్చుకున్నప్పుడల్లా, వట్టిచేతులతో వచ్చిన సామ్రాజ్యాన్ని చూసి గంగమ్మ నా నా మాటలూ అనేది.

సామ్రాజ్యం భర్తకు యివేమీ తెలియవు. అతను పొద్దస్తమానం పొలం పనులతో తల మునకలవుతూండేవాడు. అత్తచేత తిట్లుపడినప్పుడల్లా సామ్రాజ్యం పెరటి చివరవున్న గుబురు చింతచెట్టు కింద కూర్చుని కంట తడి పెట్టుకునేది.

ఆ చింతచెట్టు మీదికి ఆ మధ్య రెండు దయ్యాలు వచ్చి చేరాయి. అవి బతికున్న రోజుల్లో భార్యాభర్తలు. మంచి ధనవంతులు. పిల్లలు లేరు. చాలా ధనం, బంగారు నగలూ వుండేవి. ఎంతో పరోపకారులని పేరు బడ్డారు. ఒక పడవ ప్రమాదంలో యిద్దరూ మరణించి, యిలా దయ్యాలయారు.

వాళ్ళు తమ ధనాన్నీ, బంగారు నగలనూ ఒక సంచీలో వేసుకుని, మొదటిసారిగా శ్మశానం పక్కన వున్న ఊడల మర్రి దగ్గిరకు వెళ్ళారు. ఆ చెట్టును అప్పటికే ఆశ్రయించి వున్న దయ్యాలు వాళ్ళను చూసి, ''ఇక ముందు డబ్బుతో మీకేం పని? ఒట్టి మోత బరువు.'' అన్నవి.

''డబ్బు మోత బరువు ఎలా అవుతుంది? దీనితో ఆపదలో వున్న మనుషు

గవ్వల నిర్మలాదేవి



లకు సాయం చేయవచ్చు," అన్నవి దయ్యాలు రెండూ.

"ఓహెూఁ, మీరేదో సత్తెకాలపు దయ్యాల్లా వున్నారు! మీ లాంటివాళ్ళు ఆపదలు కోరి మరీ తెచ్చుకుంటారు. ఇక్కడ మీకు చోటులేదు," అంటూ మర్రిదయ్యాలు కసురుకున్నవి.

"సరే, మేం వుండడం మరెక్కడైనా వుంటాం. వెంట తెచ్చుకున్న, ఈ డబ్బు సంచీనైనా చెట్టు తొర్రలో దాచనివ్వండి," అని భార్యాభర్త దయ్యాలు బతిమాలుకున్నవి.

అందుకు మర్రిదయ్యాలు సరే అనగానే, అవి రెండూ డబ్బు సంచీని మర్రిచెట్టు తొర్రలో దాచి, సామ్రాజ్యం వాళ్ళ పెరట్లోని చింతచెట్టు మీద నివాసం ఏర్పరచుకున్నవి.

ఈ దయ్యం దంపతులకు రోజూ ఏదో ఒక వేళలో, సామ్రాజ్యం అత్త చేత తిట్లు తిని, చెట్టు కిందికి వచ్చి కూర్చుని కళ్ళనీళ్ళు పెట్టుకోవడం కంటపడ సాగింది. కారణం ఏమిటా అని అవి ఒక రోజు గంగమ్మ ఇంట ప్రవేశించి, సంగతి తెలుసుకున్నవి.

"మిగతా కోడళ్ళలా పుట్టింటి నుంచి కట్న కానుకలు తేలేదని, యీ గయ్యాళి అత్త, ఆ అమ్మాయిని రాచిరంపాన పెడుతున్నది," అన్నది ఆడదయ్యం.

"ఆ కట్న కానుకలేవో, ఆ అమ్మాయికి మనమే ముట్టజెప్పవచ్చు. కాని, అది ఎలా సాధ్యమవుతుంది?" అన్నది మగ దయ్యం.

ఆ తరవాత రెండు దయ్యాలూ చాలా సేపు మాట్లాడుకుని ఒక నిశ్చయానికి వచ్చినై. మగ దయ్యం డబ్బు తెచ్చేందుకు శ్మశానంలోని ఊడల మర్రి దగ్గిరకు వెళ్ళింది.

మర్రిదయ్యాలు దాన్ని చూస్తూనే, "ఆహాఁ, పరోపకారాల దయ్యం దానయ్యబాబు వచ్చాడు! సంగతేమిటి?" అని అడిగినై.

"కష్టంలో వున్న ఒకళ్ళకు రవ్వంత సాయం చేయాలి. నేను చెట్టు తొర్రలో దాచిన డబ్బు కొంత తీసుకుపోతాను," అన్నది మగదయ్యం.

"మోసకారి మనుషులకు సాయమా! సరే, డబ్బు నీది, అలాగే తీసుకుపో," అన్నవి మర్రిదయ్యాలు.

ఆ మర్నాడు ఉదయం సామ్రాజ్యం వాకిట్లో కళ్ళాపి చల్లుతూండగా, ఇద్దరు వృద్ధ దంపతులు అటుగా వచ్చి, "అమ్మాయ్, సామ్రాజ్యం, బావున్నావా?" అని అడిగారు.

సామ్రాజ్యం తల ఎత్తి వాళ్ళ కేసి చూసి ఆశ్చర్యపోయింది. ఆమె వాళ్ళను ఏనాడూ చూసి వుండలేదు. వృద్ధురాలు మెడ నిండా నగలతో, పట్టుచీర కట్టుకుని వున్నది. వృద్ధుడు పట్టు ధోవతీ, జరీ కండువా, వేళ్ళకు బంగారు ఉంగరాలూ పెట్టుకుని వున్నాడు.

ఆ సమయంలో గడప దగ్గిరకు వచ్చిన గంగమ్మ వాళ్ళను చూసి నివ్వెరపడింది. వృద్ధురాలు సామ్రాజ్యాన్ని సమీపించి, "ఇంతప్పుడు చూశాను, ఎంతదాని వయ్యావు! ఇంకా నన్ను గుర్తు పట్టలేదా ఏం? కాంతమ్మ పిన్నిని!" అన్నది.

అప్పటికి గంగమ్మ కాస్త తేరుకుని, "అయ్యో, వారిని వీధిలో నిలబెట్టి, అలా చూస్తావేం? ఇంట్లోకి రమ్మను," అన్నది.

సామ్రాజ్యం వెనకగా వృద్ధ దంపతులు ఇంట్లోకి వచ్చారు. ముసలావిడ





గంగమ్మతో, ''నేను, సామ్రాజ్యం తల్లికి వేలు విడిచిన పినతల్లి కూతుర్ని. గొప్పలు చెప్పుకుంటున్నానని అనుకోకండి, మాకు తలమునకలయేంత డబ్బున్నది కాని, పిల్లలు లేరు. చాలాకాలంగా అలా పుణ్యక్షేత్రాలు తిరుగుతున్నాం. ఇప్పుడు రామతీర్థం పోతున్నాం.'' అని, సంచీలోంచి రెండు పట్టు చీరలూ, కొన్ని నగలూ తీసి సామ్రాజ్యాని కిచ్చింది.

తరవాత వాళ్ళు, గంగమ్మ ఎంత బతిమాలినా వుండక, నిర్మానుష్యంగా వున్న వీధి మలుపు తిరిగి, అదృశ్యమై చింతచెట్టు మీదికి దయ్యాల రూపంలో చేరారు.

పరోపకారి దయ్యాలు అటు వెళ్ళగానే గంగమ్మ, సామ్రాజ్యం కేసి కోపంగా చూస్తూ, ''ఇన్నాళ్ళుగా ఎంత కపట నాటకం ఆడుతున్నావు! ఇంత ఆస్తిపరురాలైన పినతల్లి వున్నట్టు ఏనాడైనా చెప్పావా? మీ వాళ్ళు యీ నాటివరకూ అత్తగారి లాంఛనాలంటూనే జరపలేదు. నిన్ను పుట్టింటికి తరిమయినా, ఆ సంగతి తేల్చుకుంటాను,'' అన్నది.

ఈ మాటలు విన్న దయ్యాలకు మతిపోయినంత పనయింది. మనం ముందు గంగమ్మను తృప్తిపరిస్తే బావుండేది అనుకున్నవి. మగ దయ్యం డబ్బు కోసం ఊడలమర్రి దగ్గిరకు వెళ్ళింది. ఆ సమయంలో ఒక్క ముసలి దయ్యం మాత్రం తొర్ర పక్కన కూర్చుని కునికిపాట్లు పడుతున్నది.

అది, మగ దయ్యాన్ని చూసి, ''లోగడ ఎవరికో సాయం అంటూ కొంత డబ్బు తీసుకుపోయావు, వాళ్ళ కష్టాలు గట్టెక్కినయ్యా?'' అని అడిగింది.

''అప్పుడే ఎక్కడ! ఆ డబ్బు అత్త గంగమ్మ చేతిలో పెట్టివుంటే, కోడలు కష్టాలు తీరేవి,'' అన్నది మగదయ్యం.

ముసలి దయ్యం ఉలిక్కిపడుతూ పెద్దగా ఆవులించి, ''ఏ గంగమ్మ సంగతి నువ్వు చెప్పేది?'' అన్నది.

మగదయ్యం గంగమ్మ ఇంటి గుర్తులు చెప్పింది.

"ఆ గయ్యాళి గంగా! దాని సంగతి నాకు వదులు. నువ్వు మెదలకుండా పోయి, దాని పెరట్లోని చింతచెట్టు మీద సుఖంగా నిద్రపో." అన్నది ముసలి దయ్యం.

ఆ రాత్రి ముసలి దయ్యం బాగా నిద్రలో వున్న గంగమ్మను గట్టిగా వీపు తట్టి లేపి, "నే నెవర్నే, కోడలా?" అని అడిగింది.

గంగమ్మ వణికిపోతూ, "నువ్వా, అత్తయ్యా!" అన్నది.

"అవును, నేనే! బతికుండగా నిన్ను నానా హింసలూ పెట్టి, ఆ పాపంకొద్దీ చచ్చాక యిలా దయ్యం బతుకు, బతుకుతున్నాను. నీకూ, నా గతే పట్టాలన్న కోరిక వుంటే సరేసరి, ఇద్దరం చక్కా ఊడలమర్రి కొమ్మల్లో మరొకసారి అత్తా, కోడళ్ళలా కాలం గడుపుదాం. అలా కాదనుకున్నావే, నీ చిన్న కోడలు సామ్రాజ్యాన్ని దయగా చూసుకో." అన్నది ముసలి అత్త దయ్యం.

గంగమ్మకు తన అత్త కోరినంత కట్నం తేలేదని తనను ఎన్ని కష్టాలపాలు చేసిందో గుర్తుకు వచ్చింది. ఆమె గట్టిగా లెంపలు వేసుకుని, "అత్తయ్యా, నువ్వు బతికుండగా నన్ను తిట్లూ, శాపనార్థాలతో బాధించినా, చనిపోయాక తిరిగొచ్చి బుద్ధొచ్చే మాటలు చెప్పావు. ఈనాటి నుంచీ నా చిన్న కోడల్ని దయగా చూసుకుంటాను." అన్నది.

అత్త దయ్యం చింతచెట్టు మీదికి పోయి, పరోపకారి దయ్యాలతో, "గంగమ్మ యిక కోడల్ని పల్లెత్తుమాట అనదు. ఈ ముసలితనంలో మీరు వాళ్ళకూ, వీళ్ళకూ సాయం అంటూ హైరాన పడకండి." అని చెప్పింది.

ఆ తరవాత ఏనాడూ పరోపకారి దయ్యాలు, సామ్రాజ్యం, చింతచెట్టు కిందికి వచ్చి కళ్ళనీళ్ళు పెట్టుకోవడం చూడలేదు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 డిసెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



J. Banerjee





Devidas Kasbekar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ అక్టోబర్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అయ్యా, నమస్కారాలు !

రెండవ ఫోటో : ఆలోచిస్తున్నా వధకాలు !

పంపినవారు : బైసాని రవి, శంకరపల్లి, రంగారెడ్డి జిల్లా.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

## విప్పండి, విప్పండి చిక్కుప్రశ్న.
## అమ్మకోసం, నాన్నకోసం మరియు నాకోసం.

### కెనరా బ్యాంకు ప్రకృతి క్విజ్

1. వడ్రంగి పిట్టలు చెట్లను ఎందుకు పొడుస్తుంటాయి ?
2. కొన్ని పక్షులు నూకల్ని ఎందుకు తింటాయి ?
3. గుడ్లగూబలు ఎప్పుడు వేటాడుతాయి ?
4. 'క' అనే అక్షరంలో మొదలయ్యే చేపల్ని తినే పక్షి పేరు చెప్పు.
5. ఈదే ఒకే ఒక పక్షి ఏది ?

ఓహో! తెలివైన పిల్లలకోసం.
తెలివైన విద్యార్థిగా వుండు. ఆశలను
వెంటాడు! మరియు కెనరా బ్యాంకు తెలివైన
నీలాంటి యువకులకు ఉన్నత విద్యాభ్యాసానికి
ధనాన్ని అప్పుగా అందజేసి సహకరిస్తుందన్న
విషయాన్ని జ్ఞాపకముంచుకో!

# కెనరా బ్యాంకునుండి ఉచితం స్టిక్కర్స్

మీ బాలక్షేమ లేక మైనరు ఖాతా ఉన్న కెనరా బ్యాంకు శాఖనుండి స్టిక్కర్స్‌ను తీసుకోండి.

జవాబులు

1. అవి చెట్ల బెరడులలోని కీటకాల్ని, పురుగుల్ని తింటాయి.
2. అది జీర్ణంకాని ఆహారం సులభంగా జీర్ణమవడానికి ఉపయోగ పడుతుంది.
3. రాత్రులలో.
4. కార్మోరాంట్.
5. పెంగ్విన్.

నీవు మైనరు అయితే ఏం ?

నీవు కెనరా బ్యాంకులో నీకొరకు ఒక ఖాతాను ప్రారంభించమని నీ తల్లికిగాని తండ్రికిగాని చెప్పు. నీవు పద్నాలుగేండ్ల వాడవైన వెంటనే నీవే ఒక ఖాతాను సొంతముగా ప్రారంభించి నడపవచ్చును. చిన్న మొత్తమైన అయిదు రూపాయలతోనే నేడే ఖాతా ప్రారంభించి ఆ ఆనందాన్ని నీవే పొందు.

విద్యానిధి : నీవు డాక్టరువి కావాలనుకొంటున్నావా ? లేక ఇంజనీరా ?? లేక సైంటిస్టా ??? అయితే దానికి జవాబు విద్యానిధి. నీ తల్లిదండ్రులతో నేడే ఒక ఖాతాను ప్రారంభించమని చెప్పు. నీ ఉన్నత విద్యాభ్యాసం వీకూ చింత లేనిదిగా వుంటుంది.

బాలక్షేమ : చురుకైన పిల్లలు తమ పాకెట్‌మనీ సంతటిని ఖర్చు పెట్టరు. కొంత కెనరా బ్యాంకు టి.వి. బాక్సుకోసం దాస్తారు. తెలివిగా ప్రవర్తించండి. మీ తల్లిదండ్రులను కెనరా బ్యాంకులో "బాలక్షేమ" ఖాతాను ప్రారంభించమని అడగండి. వారిచ్చేటి డబ్బును టి.వి. డబ్బాలో వేస్తూ అవి వృద్ధి చెందడం గమనించు. నీ కలలన్నీ నిజమవుతాయి.





## కెనరా బ్యాంక్

(జాతీయ బ్యాంక్)

ప్రవేశ రుసుము లేదు




# చందమామ కేమెల్
## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. నం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name: ______________________ Age: ______________

Address: ____________________________________

______________________________________________

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: *30—10—1982*

**CONTEST NO 26**

VISION Tel